Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 19 • 7-5-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## వీహెచ్‌కు రాజ్యసభ టిక్కెట్‌పై మడతపేచీ

# అధిష్టానానికి జగన్ సవాల్!

రాజ్యసభ ఎన్నికలలో తన బలాన్ని ప్రదర్శించాలని వైఎస్.జగన్ ప్రణాళిక రచిస్తున్నట్లు తెలుస్తున్నది. ముఖ్యమంత్రి రోశయ్య క్రమక్రమంగా బలహీనపడి పోతుండడం, తూర్పు గోదావరి, ఖమ్మం జిల్లాలలో తాను జరిపిన ఓదార్పు యాత్రలు వూహించిన దానికంటే అధికంగా విజయవంతం కావడంతో జగన్‌కు వెయ్యేనుగుల బలం వచ్చింది. ఇటీవల కొంతకాలంగా జగన్‌కు దూరదూరంగా మెలగుతుండిన ఎమ్మెల్యేలు, మంత్రులు మళ్లీ ఆయన దర్శనం కోసం ప్రాకులాడుతున్నారు. కొందరు రహస్యంగా, మరి కొందరు బహిరంగంగా జగన్ ఇంటికి వెళ్లి మేము మీతోనే వున్నామని బాస చేసి వస్తున్నారు. ఇప్పటికిప్పుడు బల పరీక్ష జరిగితే తన వైపు కనీసం వందమంది వరకు ఎమ్మెల్యేలు నిలుస్తారనే ధీమాతో వున్నాడు జగన్. ఈ బలాన్ని అధిష్టానానికి చూపించాలన్నది ఆయన కోరిక. అందుకు రాజ్యసభ ఎన్నికలను ఒక అవకాశంగా తీసుకోవాలని భావిస్తున్నాడు.

వైఎస్ మరణించి ఎనిమిది నెలలు గడిచి పోయినా సోనియాగాంధీకి తన పట్ల సానుకూల అభిప్రాయం కలగడం లేదన్న బాధ జగన్‌లో వుంది. ముఖ్యమంత్రి పదవి కోరిన తనకు, అది ఇవ్వలేని పక్షంలో ఏదో ఒక పదవి ఇచ్చి మచ్చిక చేసుకొంటారని ఆశించారు. కొంతకాలం ఉపముఖ్యమంత్రి పదవి మీద వూహాగానాలు నడిచాయి. మరి కొంతకాలం పిసిసి అధ్యక్షత కట్టబెడతారని ప్రచారం జరిగింది. కేంద్రంలో సహాయ మంత్రిత్వం ఖాయమని పత్రికలు వార్తలు కూడా వ్రాశాయి. కానీ నెలలు గడుస్తున్నా ఏ ఒక్క పదవికీ తన పేరు పరిశీలనకు తీసుకోవడం లేదు అధిష్టానం. పైపెచ్చు తనను కనీసం పిలిచి మాట్లాడడానికి కూడా సోనియా ఆసక్తి చూపడం లేదు. మరొకప్రక్క జగన్ మనుషులుగా ఆమెను కలవడానికి వెళ్లిన ఎమ్పీలు, రాష్ట్ర నాయకుల దగ్గర అప్రసన్నంగా ముఖం పెడుతున్నదట. జగన్ పేరు చెప్తేనే ఆమె ముఖంలో రంగులు మారుతున్నాయట. దానితో జగన్‌కు ఎంతో ముఖ్యులు కూడా సోనియాను కలవడానికి వెళ్లినప్పుడు ఆ పేరు ప్రస్తావనకు రాకుండా జాగ్రత్తపడుతున్నారు. ఈ సమాచారం ఎప్పటికప్పుడు జగన్‌కు చేరుతూనే వుంది. అది విన్నప్పుడల్లా ఆవేశపడుతున్నాడు. కానీ ఏమీ చేయలేని పరిస్థితి. ఇక ఇప్పట్లో తాను సోనియా ఆదరణ పొందడం కష్టమన్న నిరాశ ఆయన్ను వేధిస్తున్నది. అందువల్ల ఎమ్పీగా కూడా ఆమెను కలవడానికి జగన్ ఇష్టపడడం లేదు. వైఎస్ మరణానికి సానుభూతి తెలిపినందుకు కృతజ్ఞతలు చెప్పడానికి ఒకసారి, ఆ తర్వాత పులివెందుల ఉపఎన్నిక కోసం మొత్తం కుటుంబ సభ్యులతో కలిసి మరొకసారి మాత్రమే సోనియాను కలిశాడు జగన్. ఈ నాలుగైదు నెలల్లో ఒక్కసారి కూడా ఆయనకు అపాయింట్‌మెంట్ ఇవ్వలేదు కాంగ్రెస్ అధినేత్రి.

ఈ నేపథ్యంలో సోనియా గానీ, ఢిల్లీలోని కాంగ్రెస్ పెద్దలు కానీ తానేమిటో తెలుసుకోవాలంటే రాజ్యసభ ఎన్నికలలో తన ప్రతాపం చూపించాలన్న నిర్ణయానికి వచ్చినట్లు చెప్తున్నారు. దానికి సంకేతంగా వి.హనుమంతరావును బలిపెట్టబో

కొరవ 14వ పేజీలో

## పోలీసు రక్షణ కోరిన మంత్రి!



సాధారణ ప్రజలు తమకు రక్షణ కల్పించమని మంత్రులను వేడుకోవడం ఆనవాయితీ. కానీ విస్మయకరంగా జిల్లామంత్రి ఆనం రామనారాయణరెడ్డి తమకు రక్షణ కావాలని ఎస్పీ దామోదర్‌ను కోరారు. ముఖ్యమంత్రి నెల్లూరు పర్యటనలో రాజీవ్‌భవన్ సన్నాహాలు వారిలో వణుకు పుట్టించాయి. ఎక్కడో ఒక దగ్గర ఏదో ఒక మిషతో తమను అవమానించే ప్రయత్నం జరగవచ్చునని భయపడ్డారు. దాన్ని ప్రతిఘటించే శక్తి ఇప్పుడు ఆనం కుటుంబానికి లేదు. దానితో ఎస్పీని పిలిపించి, తమ అనుచరులను, మరీ ముఖ్యంగా తన సోదరుడు వివేకానందరెడ్డిని జాగ్రత్తగా చూసుకోమని విజ్ఞప్తి చేశాడట. దానితో సిఎం కోసం ఏర్పాటు చేసిన రోప్ పార్టీ మధ్యలోనే వివేకా వుండేట్లుగా ఏర్పాటు చేసింది పోలీసు యంత్రాంగం. రైల్వే స్టేషన్‌లో, వేదిక వద్ద ఆయన్ను ఒకటికి పదిమంది పోలీసులు కమ్ముకొని, పూర్తి రక్షణ కల్పించారు.

పాతరోజులలో ఆనం వారిని చూసి అందరూ భయపడేవారు. వారికి మూకబలం వుందని భావించేవారు. కానీ రాజీవ్‌భవన్ పుణ్యమా అని అది తిరగబడింది. అందరినీ భయపెట్టడం అలవాటుగా మార్చుకొన్న వారు, తమకే రక్షణ లేదని హడలిపోయే పరిస్థితి తెచ్చుకొన్నారు. భూమి గుండ్రంగా వుంటుందని అందుకే కదా అనేది.

## కార్టూన్ స్కేప్




ఏమేవ్.. మా పనితీరును సిఎం మెచ్చుకున్నట్లు పేపర్లో వచ్చిందట. కాస్త దీపం ఇలా పట్టుకురా!

## మీసాలు మెలేస్తున్నారు!

ముఖ్యమంత్రి రోశయ్యకు ప్రభుత్వం మీద పట్టు నెలకొక రీతిగా మారిపోతున్నది. గత సెప్టెంబర్‌లో పదవి స్వీకరించినప్పుడు కేవలం ఆపద్ధర్మంగా నడిచింది వ్యవహారం. ఆ తర్వాత జగన్ ఒత్తిడితో ముఖ్యమంత్రికి వూపిరాడలేదు. క్యాబినెట్ సమావేశంలోనే మంత్రులు ముఖ్యమంత్రి మీద ఫైళ్లు విసిరేశారు. రోశయ్య వంటి బలహీన నేత క్రింద పని చేయవలసి రావడం మా దురదృష్టం అని ప్రకటనలు చేశారు. కేంద్ర నాయకత్వం జగన్‌ను గట్టిగా గదమాయించడంతో పరిస్థితి కొంత మారింది. ఈలోగా తెలంగాణ ఉద్యమం వచ్చి మరొకసారి బలహీనపడి పోయాడు రోశయ్య. ఆయన పిలిచే సమావేశాలకు హాజరుకాకుండా తమ లెక్కలేనితనం ప్రదర్శించారు మంత్రులు. శాసనసభ బడ్జెట్ సమావేశాలతో మళ్లీ మార్పు వచ్చింది. సమావేశాలు సాఫీగా జరగడం, మంత్రివర్గ ప్రక్షాళన జరగబోతుందన్న ప్రచారం, జగన్ అనుచర మంత్రులు పది మంది వరకు ఇళ్లకు వెళ్లక తప్పదన్న భావన ముఖ్యమంత్రిని బలోపేతం చేశాయి. కొమ్ములు తిరిగిన మంత్రులు కూడా ఆయన ముందు పిల్లుల వలె మారి ప్రవర్తించారు. అసెంబ్లీ తర్వాత, సిఎం ఢిల్లీ యాత్రతో పరిస్థితి మరొకసారి మొదటికొచ్చింది. మంత్రివర్గ విస్తరణకు సోనియా అనుమతి లభించలేదన్న అభిప్రాయం బలపడడంతో మం

కొరవ 14వ పేజీలో

# ఐఏఎస్‌లు అతీతులా?

రంగారెడ్డి జిల్లా జాయింట్ కలెక్టర్ జగన్మోహన్‌ను అవినీతి నిరోధక శాఖ అధికారులు అరెస్టు చేయడం రాష్ట్ర అధికారగణంలో సంచలనం రేకెత్తించింది. ఆయన ఇంట్లో దొరికిన అక్రమార్జన విలువ 20కోట్లకు పైమాటే అని తెలుస్తున్నది. ఇది ఎసిబి అధికారులు రిజిష్టర్ పత్రాల అధారంగా కట్టే లెక్క. వాస్తవంలో వాటి విలువ అంతకు పదిరెట్లైనా వుంటుందన్నది బహిరంగ సత్యం. రంగారెడ్డి జిల్లా అంటే రియల్ ఎస్టేట్ వ్యాపారుల స్వర్గధామం. ఆరేడేళ్ల క్రితం వరకు తొండలు గుడ్లు కూడా పెట్టని బంజరు భూములు, ఆ తర్వాత బంగారు గనులుగా మారాయి. ఎకరం యాభై కోట్ల ధర పలికాయి. దానితో ప్రభుత్వ భూములను, పాకిస్తాన్ వలస వెళ్లిన కాందిశీకుల భూములను, నిజాం కాలంలో సరైన పత్రాలు లేకుండా దానాలిచ్చిన భూములను ఆక్రమించి అమ్ముకోవడానికి రియల్ ఎస్టేట్ వ్యాపారులు, రాజకీయ నాయకులు పోటీలు పడ్డారు. వారికి రెవెన్యూ అధికారులు అన్నివిధాల సహకరిస్తున్నారు. ఆ క్రమంలో రంగారెడ్డి, హైదరాబాద్ జిల్లాలలో పని చేసే రెవిన్యూ ఉద్యోగులు, అధికారుల జీవితం నిత్య కళ్యాణం పచ్చతోరణంగా మారింది. సాధారణ ఎమ్మార్వో స్థాయి అధికారి కూడా వందలాది కోట్లు ఆర్జించిన దాఖలాలున్నాయి. ఈ అక్రమాలకు కలెక్టర్లు, జాయింట్ కలెక్టర్లు తోడ్పాటు అందిస్తున్నారు. ఆ పాపపు సొమ్ములో వాటాలు పంచుకొంటున్నారు. ఆ తానులో ఒక పేలిక జగన్మోహన్.

ఒక ఐఎఎస్ అధికారి మీద ఎసిబి దాడి జరగడం చాలా అరుదైన విషయం. ఇటువంటి సంస్థలకు తాము అతీతులమన్నట్లు వ్యవహరిస్తున్నారు వారు. అందుకు తగినట్లుగా నిబంధనలు తామే రూపొందిస్తారు. ఐఎఎస్ అధికారి మీద దాడి జరపాలంటే ముఖ్యమంత్రి, గవర్నర్‌ల నుంచి ముందస్తు అనుమతి కావాలని దబాయిస్తుంటారు. అది తీసుకోవాలంటే, ఆ ఫైల్ మళ్లీ ఇదే ఐఎఎస్ అధికారగణం ద్వారానే నడవాలి. ఆ సమాచారం సంబంధిత అవినీతి పరులకు ముందుగానే చేరిపోయేది. దానితో వారిమీద దాడులు జరిపి వృధా అనే నిరాసక్తతతో ఎసిబి కూడా ఇంత కాలం ఆ జోలికి పోకుండా కాలం గడుపుతూ వచ్చింది. ముఖ్యమంత్రి రోశయ్య ఈ దుష్ట ఆనవాయితీని ఛేధించాడు. అవినీతికి పాల్పడిన ఉన్నతాధికారులు చట్టానికి అతీతులు కారని, ఎసిబి దాడులు చిన్న చిన్న చేపలకు పరిమితం కాకుండా ఉన్నతస్థాయిలోని జలగలను కూడా ఒక పట్టు పట్టాలని గట్టిగా ఆదేశాలివ్వడంతో ఎసిబి ఈ సాహసోపేత చర్యకు సమకట్టింది. వారి తొలి ప్రయత్నంలోనే భారీ తిమింగలం వలకు చిక్కడం విశేషం.

నిజానికి రాష్ట్రంలో పనిచేసే ఐఎఎస్, ఐపిఎస్ అధికారులలో సగానికంటే ఎక్కువ మంది అవినీతిలో ఆరితేరిపోయివున్నారు. మైనింగ్, మార్కెటింగ్, వాణిజ్య పన్నులు, ఎక్సైజ్, రెవెన్యూ వంటి కీలక శాఖలలో పని చేసే ఐఎఎస్ అధికారులు వందల కోట్లు కూడబెట్టుకొంటున్నారు. అనంతరామ్ అనే ఐఎఎస్ అధికారి హైదరాబాద్ ఎయిర్‌పోర్టులో 25లక్షల రూపాయల అక్రమ సొత్తు బెంగుళూరులోని తన ఇంటికి తరలిస్తూ పట్టుబడ్డాడొకసారి. కానీ అప్పటి ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ఐఎఎస్ అధికారుల లాబీ ఒత్తిడికి తలవంచి, ఆయన్ను బేషరతుగా వదిలిపెట్టాడు.

ఎన్ని పంచవర్ష ప్రణాళికలు గడిచిపోయినా భారతదేశంలో పేదరికం తొలగక పోవడానికి, ప్రభుత్వం ఖర్చు పెట్టే లక్షలాది కోట్ల రూపాయలు పేద ప్రజల జీవితాలలో మార్పు తేలేక పోవడానికి ప్రధాన కారణం రాజకీయ అవినీతి అయితే, రెండవ కారణం ఐఎఎస్ అధికారుల అక్రమ ప్రవర్తన. ఒక్క మాటలో చెప్పాలంటే దేశానికి పట్టిన చీడపురుగులు వలె తయారయ్యారు వీరు. ఈ చీడను తొలగించడానికి ఉద్యమస్థాయిలో బృహత్ ప్రయత్నం జరిగితే తప్ప ఫలితం రాదు. రాష్ట్ర సచివాలయంలో, జిల్లాలలో వందలాదిగా వున్న జగన్మోహన్ వంటి అధికారుల భరతం పట్టడానికి, వారిని సక్రమ దారిలో పెట్టడానికి ఈ దాడి ఒక నాంది కావాలని ఆశిస్తున్నాము. అవినీతి అనే విషపు పురుగు ఎక్కడున్నా ఇదే తీరులో నిర్మూలించే ప్రయత్నం జరగాలని కోరుకొంటున్నాము.

జమీన్‌రైతు

## జనవాణి

### రోశయ్య వచ్చి చేసిందేమిటి?

ముఖ్యమంత్రిగా బాధ్యతలు తీసుకొన్న కొణిజేటి రోశయ్యగారు 2తేది నెల్లూరులో పర్యటించారు. ఈ పర్యటనకు లక్షలాది రూపాయల ప్రజాధనాన్ని వెచ్చించారు. కాని ఆయన జిల్లాకు వుపయోగపడే ఒక్క ప్రజోపయోగ కార్యక్రమాన్ని ప్రకటించలేదు. జిల్లాలో కొలువై వున్న సమస్యలపై అధికారులతో సమీక్ష జరిపే తీరిక కూడా లేదు. కాని కాంగ్రెస్‌పార్టీలోని మూడు గ్రూపుల నాయకుల ఇళ్లకు మాత్రం వెళ్లి విందులు చేసివచ్చారు. ఈ పని చేయను ఆయన హైదరాబాద్ నుంచి నెల్లూరుకు రావడం అనవసరమనే చెప్పాలి.

పి.అరుణకుమారి, నెల్లూరు

### పన్నులు కట్టించుకోని బిల్ కలెక్టర్!

నెల్లూరు కార్పొరేషన్ రంగనాయకులపేటలో పన్నులు కట్టించుకోను పెట్టిన బిల్‌కలెక్టర్ వ్యవహారశైలి విచిత్రంగా వుంటోంది. పన్నులు కట్టను వెళ్లిన జనం చేత ఆయన పన్నులు కట్టించుకోడు. బిల్లు పుస్తకాలు లేవు. వున్నతాధికారుల వద్ద అవి వున్నాయి అంటూ ఏవేవో కుంటిసాకులు చెప్పి వెనక్కు పంపిస్తున్నాడు. ఈ బిల్లు కలెక్టర్ నిర్లక్ష్యం మూలంగా, భవిష్యత్తులో పన్ను చెల్లింపుదారులకు ఇబ్బందులు తప్పేట్లు లేవు. ఇతనిపై కార్పొరేషన్ అధికారులు చర్యలు తీసుకోవాల్సి వుంది.

ఎన్.రాధయ్య, నెల్లూరు

### విడవలూరులో దురాక్రమణ

విడవలూరు గ్రామంలో పీర్లచావిడి స్థలం ఎంతో విలువైనది. దీన్ని ముందు వెనుక కొంతమంది దురాక్రమించి కట్టడాలు కట్టుకొంటున్నారు. ఈ ప్రాంతంలో వున్న బోరు తొలగించి ఒకరు నిర్మాణాలు చేపడుతున్నారు. గ్రామ నడిబొడ్డులో ఇంత విలువైన స్థలాన్ని దురాక్రమిస్తున్నా సర్పంచ్ ఎందుకు మౌనముద్ర దాల్చారో అర్థం కావడం లేదు. జిల్లా పంచాయితీ అధికారైనా ఈ విషయమై తగిన చర్యలు తీసుకోవాలి.

కెవి.రాజేశ్వరి, విడవలూరు

### విద్యా హక్కు చట్టాన్ని సవరించాలి!

ఏప్రెల్ 1తేది నుంచి అమలులోకి వచ్చిన విద్యా హక్కు చట్టం కేంద్ర

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**10-5-1940**
**పేజీలు : 16 వెల: అణా**

### నెల్లూరు ముచ్చట్లు
### సంస్కృత కళాశాల

అప్పుడప్పుడు మా మూలప్పేట సంస్కృత కళాశాలలో బ్రాహ్మణ – అబ్రాహ్మణ అనే విష వాయువులు వీస్తుండడం విచారకరం. విచారకమే కాదు ప్రమాదకరం గూడా. కళాశాలలో యింతవరకు సాహిత్యాధ్యాపకులుగా నుండిన గోవిందాచార్యుల వారిని వయోవృద్ధులని నిలిపేశారు. ఆ స్థానానికి అదే కళాశాలలో చదివి రాష్ట్రంలోనే ప్రధముడుగా ఉత్తీర్ణుడైన 'సాహిత్య విద్యాప్రవీణ' మారంరెడ్డి జానకిరామరెడ్డి గారు దరఖాస్తు బెట్టాడు. ఈ స్థానానికి యితను అర్హుడని గోవిందాచార్యుల వారు కూడా సర్టిఫై చేశారు. కానీ వచ్చిన బెడదేమంటే చూస్తూ బ్రాహ్మణేతరుణ్ణి అధ్యాపకుడుగా నియమించడం, అతని వద్ద బ్రాహ్మణ కుర్రలు చదవడమా, అనేదే వారి చిక్కు ప్రశ్న.

ఓ కళాశాల గారు! నీ బ్రతుకు సమస్యను తేల్చింది బోడిరెడ్డి రంగారెడ్డి అనే బ్రాహ్మణేతరుడు. అతని ఆస్తిపాస్తులు నీకు సమర్పించి చరితార్థుడైనాడు. ఇంకా ఎంతోమంది బ్రాహ్మణేతరులు నిన్ను పోషిస్తున్నారు. అలాంటప్పుడు బ్రాహ్మణేతర సాహిత్యానికి నిష్ణాత పండితునికొక స్థానమివ్వకుండా మెడబెట్టి గెంటావంటే అది మానరాని కురుపౌతుంది నీ శరీరానికి. తాత్కాలిక వ్యక్తుల వర్ణ ద్వేషాలతో చిరస్థాయియగు ఒక ప్రాచీన వాఙ్మయ సంస్థకు నిప్పుబెట్టడం ధర్మం కాదు. ఆలోచించండి – మళ్లీ ఆలోచించండి. తిరుగా ఆలోచించండి.

– విమర్శకుడు

### కోటారెడ్డి పెండ్లి

పోట్లపూడిలో ఇందుపూరు కోటారెడ్డి అనే 80 సంవత్సరాల శత వృద్ధుడు 14 సంవత్సరాలు నిండని ఒక బాలికకు నేడు బొట్టు గట్టాడని విచిత్ర వార్త. ఈలాంటి దురాచారాన్ని మాన్పలేని బుద్ధిలేని సంఘం ఇంకా బ్రతికుందా అట. ఓ రెడ్డిజన సంఘమా! ఎక్కడ చచ్చావు నీవు. యిలాంటి ఘోర దురన్యాయాలు జరుగుతుంటే చూస్తూ. కోటారెడ్డికి నేను మిత్రుడినే కాని నా కలం గాదు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**6-5-1960**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### ఏ.సి రాజీనామా ఇవ్వవలెనా?

3వ తేది జరిగిన ప్రదేశ్ కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డుకు, ముఖ్యమంత్రి సంజీవయ్య గారి ప్రతిపాదనకు వ్యతిరేకంగా ఏ.సి.సుబ్బారెడ్డిగారు పోటీజేయడంతో, ఆంధ్ర రాజకీయాలలో పెద్ద సంచలనం కలిగింది. నూత్న మంత్రివర్గంలో అంతర్గతంగా వుంటున్న విభేదాలు ఒక్కసారి బయటబడినవి.

సంజీవయ్య గారు పార్లమెంటరీ బోర్డుకు తొమ్మిది పేర్లను సూచించారు. వారినే ఎన్నుకోవలసిందిగా ఆదేశించారు. అల్లూరు సత్యనారాయణ రాజు – నరోత్తమరెడ్డి ప్రభృతులంతా ముఖ్యమంత్రి సూచనను బలపరచారు. ముఖ్యమంత్రి సూచించిన పేర్లు గాక మరికొందరి పేర్లు ప్రతిపాదించబడినవి. అందులో పరిశ్రమల మంత్రి ఏ.సి.సుబ్బారెడ్డి గారి పేరొకటి. ఉప ముఖ్యమంత్రి కొండా వెంకటరంగారెడ్డి, కామేశ్వరరావు, ఎం.ఆర్.అప్పారావు గారలు పోటీ నుండి విరమించుకున్నారు గాని, సుబ్బారెడ్డి గారు మాత్రం వుపసంహరించుకోలేదు. సుబ్బారెడ్డి గారి వుపసంహరణకు అవకాశం కల్పించుటకుగాను సమావేశం అర్థగంట సేపు వాయిదా వేయబడింది గూడా. కానీ చివరకు పోటీ తప్పలేదు.

హాజరైన 236 మంది రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులలో 98 మంది మాత్రమే సుబ్బారెడ్డి గారికి ఓటు జేశారు. సుబ్బారెడ్డిగారు ఓడిపోయారు. సంజీవయ్య గారు ప్రతిపాదించిన తొమ్మిది మంది ఎన్నికైనారు. ఏ సభ్యుడైనా ఎన్నికగుటకు హాజరైన సభ్యులతో మూడవ వంతు ఓట్లు రావలసి వుంటుంది. అంటే మరొక 60 ఓట్లు వచ్చి వుంటే సుబ్బారెడ్డి గారు ఎన్నికైయుండే వారన్న మాట.

సుబ్బారెడ్డి గారు తన బలాన్ని అంచనా వేసుకొనకుండా, పోటీవల్ల రాగల పరిణామాలను గూర్చి ఆలోచించకుండా, యింత తొందరపాటు పట్టుదల ఎందుకు ప్రదర్శించారో ఊహాతీతం.

# నెల్లూరు ముచ్చట్లు

## పాపం... సివిశేషారెడ్డి!

డిసిసి అధ్యక్షునిగా దశాబ్దంపాటు పనిచేయడంతోపాటు కాంగ్రెస్ పార్టీ విప్‌గా పనిచేసిన సర్వేపల్లి మాజీ శాసన సభ్యుడు సివిశేషారెడ్డి తన రాజకీయ చరమాంకంలో ప్రజారాజ్యం పార్టీలో చేరి గబ్బుపట్టారు. 2వ తేది సిఎం రోశయ్య నెల్లూరు పర్యటన సందర్భంగా ఆయన తిరిగి కాంగ్రెస్ పార్టీ తీర్థం స్వీకరించారు. ఈ సందర్భంగా ఆయన విఆర్ కాలేజి మైదానంలో జరిగిన భూ పంపిణీ సభలో ముఖ్యమంత్రి రోశయ్యను దుశ్శాలువతో సత్కరించారు. కేంద్రమంత్రి పనబాక లక్ష్మితోడురాగా పినాకినీ అతిథి గృహంలో రోశయ్యను సివిశేషారెడ్డి కలసి మాట్లాడారు. పిసిసి ఉపాధ్యక్షుని హోదాలో వుంటూ ఆయన పార్టీ మారిన సంవత్సర కాలంలోనే గతంలో సంపాదించుకొన్న సీనియారిటీకి తోడుగా ఛరిస్మాను కోల్పోవడం స్వయంకృతాపరాధమని చెప్పక తప్పదు.



## సోమిరెడ్డికి ఉత్తమ ప్రజానేత అవార్డు!

మాజీ మంత్రి, తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి చెన్నైలోని ఇండియన్ తెలుగు అసోసియేషన్ 'ఉత్తమ ప్రజానేత' బిరుదు ప్రదానం చేసింది. 2వతేది చెన్నైలోని ఫిలిం ఛాంబర్ ఆడిటోరియంలో జరిగిన ఈ కార్యక్రమంలో దక్షిణ భారతదేశంలోనే పేరుగాంచిన సర్జన్ డాక్టర్ సిఎంకె.రెడ్డి, డివిఆర్.ప్రకాశరావు, సినీ నిర్మాత కాట్రగడ్డ ప్రసాద్, నాగేష్ తదితరులు హాజరయ్యారు.

## ఎట్టకేలకు పినాకిని ప్రారంభం

నెల్లూరు బారాషహీద్ దర్గా దగ్గర కొత్తగా కట్టిన పినాకినీ అతిథి గృహాన్ని 1వ తేది పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రారంభించారు. ఈ అతిథి గృహాన్ని స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి నెల్లూరు వస్తే బసచేయను కృష్ణపట్నం పోర్టు యాజమాన్యం సహాయ సహకారాలతో కలెక్టర్ రాంగోపాల్ కట్టించారు. కార్పొరేట్ హంగులు, ప్రత్యేక సూట్‌లు, సెక్యూరిటీ కోసం ప్రత్యేక గదులు ఈ అతిథి గృహం ప్రత్యేకతలు. వాస్తవానికి దీన్ని డాక్టర్ రాజశేఖర్‌రెడ్డి ప్రారంభించాల్సింది. తుదకు రామనారాయణరెడ్డి ప్రారంభించగా ముఖ్యమంత్రి హోదాలో రోశయ్య ఒక రాత్రి నిద్ర చేశారు. ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరో అనే దానికి ఈ పినాకినీ అతిథి గృహ నిర్మాణం, ప్రారంభోత్సవమే సజీవ సాక్ష్యం.

## మళ్లీ ఇసుకరీచ్‌ల గొడవ

అధికార పార్టీలోని కొందరు నాయకులకు బంగారు బాతు గుడ్లుగా మారిన పెన్నానదిలోని ఇసుక రీచ్‌లకు గడువు ముగిసినా వేలంపాటను జరపని మైనింగ్ అధికారుల వ్యవహార సరళిపై జడ్పీఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి సిబిసిఐడి శాఖ దృష్టికి తీసుకెళ్లారు. జొన్నవాడ, పోతిరెడ్డిపాళెం ఇసుకరీచ్‌లకు గడువు ముగిసినా త్రవ్వకాలు జరుగుతూనే వున్నాయి. జడ్పీ ఛైర్మన్ ఫిర్యాదు తర్వాత విజిలెన్స్ అధికారులు రీచ్‌లపై దాడులు చేశారు. ఇసుక తరలిస్తున్న వాహనాలు పట్టుకోవడంతోపాటు విజిలెన్స్ ఎస్పీ మోహన్‌రావు ఈ వ్యవహారాలను స్వయంగా కలెక్టర్ రాంగోపాల్‌ను కలసి విన్నవించడం చర్చనీయాంశమయ్యింది.

## కలెక్టర్ క్యాంపు క్లర్క్ కుటుంబానికి న్యాయం చేయరా?

రెవిన్యూ శాఖ ఉదాసీన వైఖరికి అద్దం పట్టే విషయమిది. 50ఏళ్ల క్రితం హైదరాబాద్‌లో జరిగిన జిల్లా కలెక్టర్ల సమావేశంలో పాల్గొని వస్తుండిన జిల్లా కలెక్టర్ ఎం.ఎం.బేగ్ కారు బోగోలు మండలం కడనూతల గ్రామం దగ్గర ఘోర ప్రమాదానికి గురయ్యింది. ఈ ప్రమాదంలో కలెక్టర్, ఆయన సతీమణి గాయాలతో బయట పడగా క్యాంపు క్లర్క్ నందిబొట్ల లక్ష్మీనారాయణ అక్కడికక్కడే మరణించారు. కుటుంబ పోషకుడ్ని కోల్పోయిన ఈ కుటుంబానికి 1972 సంవత్సరం రాపూరు మండలం పెరుమాళ్లపాడు గ్రామంలో ఐదు ఎకరాల 15 సెంట్ల మెట్టభూమిని అప్పటి తహశీల్దార్ ఎ.వి.సుబ్బారావు పట్టాగా ఇచ్చారు. కానీ ఈ భూమి ఎక్కడుందో చూపలేదు. నోరులేని ఈ కుటుంబానికి ఇచ్చిన భూమి ప్రస్తుతం భూబకాసురులు దురాక్రమించారు. అప్పటికి, ఇప్పటికి ఈ

**50ఏళ్లుగా జరగని న్యాయం**

కుటుంబ పరిస్థితులు మెరుగుపడలేదు. జిల్లా కలెక్టర్, రెవిన్యూ ఉద్యోగ సంఘాల నేతలు ఇప్పటికైనా స్పందించి విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయిన కలెక్టర్ క్యాంపు క్లర్క్ లక్ష్మీనారాయణ కుటుంబానికి న్యాయం చేయాల్సి వుంది.

## పొట్టిశ్రీరాములును మరచిన రోశయ్య!

గతంలో లెక్కలేనన్ని సార్లు వివిధ హోదాల్లో కొణిజేటి రోశయ్య నెల్లూరు పర్యటనకు వచ్చారు. వచ్చిన ప్రతిసారి ఆత్మకూరు బస్టాండ్ సెంటర్‌లోని అమరజీవి పొట్టిశ్రీరాములు విగ్రహానికి ఓ పూలమాలవేసి నివాళులర్పించేవారు. ముఖ్యమంత్రి హోదాలో 2వతేది నెల్లూరు వచ్చిన ఆయన ఈసారి ఆ రివాజును పాటించలేదు. దీన్ని నిరసిస్తూ 3వతేది నెల్లూరు వాసవి క్లబ్ అధ్యక్షుడు చెవుల యుగంధర్ పొట్టిశ్రీరాములు విగ్రహానికి క్షీరాభిషేకం చేయడం అందరినీ ఆలోచింపజేసింది.

## కాళ్లకు మొక్కిన పనబాక

రాజకీయ నాయకులు ఎప్పుడేం చేస్తారో ఎవరికీ తెలియదు. తన నెల్లూరు పర్యటనలో భాగంగా కేంద్రమంత్రి పనబాక లక్ష్మి ఇంటికి టిఫిన్ చేయను వెళ్లిన ముఖ్యమంత్రి రోశయ్య బిత్తరపోయేలా చేశారు పనబాక దంపతులు. టిఫిన్ పూర్తయ్యాక కుర్చీలో కూర్చొని వుండిన రోశయ్య కాళ్లకు మొక్కేందుకు పనబాక లక్ష్మి, కృష్ణయ్య వంగారు. ఓ క్షణం ఆశ్చర్య

కొరవ 14వ పేజీలో

# రోశయ్య రాకతో అల్లాడిన జనం!


దుకాణాలను బలవంతంగా మూయించిన పోలీసు.

విపరీతమైన జనాభిమానం వున్న ముఖ్యమంత్రులు ఎన్టీ రామారావు, వైఎస్ రాజశేఖర్‌రెడ్డిలు లెక్కలేనన్నిసార్లు నెల్లూరు పర్యటనకు వచ్చారు. వీరి పర్యటన సమయంలోనూ లేనన్ని ట్రాఫిక్ ఆంక్షలను 2వ తేది నెల్లూరుకు వచ్చిన ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య పర్యటనలో చోటుచేసుకొన్నాయి. పొదలకూరురోడ్డులో అయితే 24 గంటల పాటు వాహనాలను తిరగనీయలేదు. అడ్డరోడ్డుల్లోని వాహనాలను మెయిన్‌రోడ్డు ఎక్కనీయకుండా పోలీసులు అడ్డు నిలిచారు. ఈ ఆంక్షలపై ముందుగా ప్రచారం లేకపోవడంతో ఆదివారం వివిధ పనులపై బయలుదేరిన జనం అడుగు ముందుకు వేయలేక పోలీసులతో వాదనలకు దిగారు. వాళ్లు సైతం దిక్కున్న వారికి చెప్పుకోమని పెడర్థంగా సమాధానం చెప్పడంతో జనం ముఖ్యమంత్రి రోశయ్యను శాపనార్థాలు పెట్టారు. పొదలకూరురోడ్డులోని దర్గాడౌన్‌లో కొత్తగా కట్టిన పినాకినీ అతిథి గృహంలో ఆదివారమంతా రోశయ్య బస చేయడంతో ఈ ప్రాంతంలోని సాల్వేషన్ ఆర్మీ చర్చిలో ప్రార్థనలకు క్రైస్తవ సోదరులను అనుమతించకపోవడంతో వారు బాధకు లోనయ్యారు. బారాషహీద్ దర్గా వద్ద సైతం భక్తులను అనుమతించక గేట్లు మూసిపారేశారు.

ముఖ్యమంత్రి సింహపురి ఎక్స్‌ప్రెస్‌లో రాక మునుపే రైల్వేస్టేషన్ రోడ్డు నుంచి మాగుంట సుబ్బరామిరెడ్డి విగ్రహం వరకు ట్రాఫిక్‌ను నిలిపేశారు. దీంతో రైల్వేస్టేషన్, ఆర్టీసి బస్టాండ్, ఆసుపత్రులకు వెళ్లేవారు నానాపాట్లు పడ్డారు. విఆర్ కాలేజి మైదానంలో జరిగిన ముఖ్యమంత్రి సభకు వచ్చిన బస్సులు, లారీలను మినీబైపాస్ రోడ్డులోనే నిలిపివేశారు. దీంతో జనం నడిఎండలో నడిచిరాను నానాపాట్లు పడ్డారు. సాయంత్రం ముఖ్యమంత్రి నగరంలో పలువురి ఇళ్లకు తేనీటి విందులకు బయలుదేరిన సమయం, 3వ తేది ఉదయం పనబాక లక్ష్మి ఇంటికి టిఫిన్‌కు వెళ్లిన సమయంలోనూ విధించిన ట్రాఫిక్ ఆంక్షలతో జనం విసిగివేసారి పోయారు. ప్రతి ఒక్కరూ పోలీసులు అతికి వెళ్లారంటూ విమర్శలకు దిగారు.

● అక్రమ కరెంట్‌తో

# సిఎంకు స్వాగతం!

2వ తేది నెల్లూరు విఆర్ కాలేజి మైదానంలో జరిగిన భూ పంపిణీ సభలో ముఖ్యమంత్రి రోశయ్య రాష్ట్రంలో ఎదుర్కొంటున్న కరెంట్ కష్టాలను ఏకరవు పెట్టారు. ప్రభుత్వం 12 రూపాయలు ఖర్చు పెడుతూ ఒక యూనిట్ కరెంట్‌ను ప్రక్క రాష్ట్రాల నుంచి కొనుగోలు చేస్తుందని బాధపడుతూ చెప్పారు. భవిష్యత్తులో రాష్ట్రం కరెంట్ అవసరాలను కృష్ణపట్నంలో ఏర్పాటుచేస్తున్న విద్యుత్ ప్రాజెక్టులే తీర్చాలని చెప్పుకొచ్చారు. కానీ ముఖ్యమంత్రి మాటలకు విరుద్ధంగా ఆయన పర్యటనకు అక్రమ విద్యుత్‌ను నెల్లూరు నేతలు వాడినా ట్రాన్స్‌కో అధికారులు కళ్లులేని కబోదుల్లా చూస్తూ ఊరుకొన్నారు. 2వ తేది ముఖ్యమంత్రి టిటిడి కళ్యాణ మండపం ఎదురుగా వున్న వేమాలశెట్టి బావి సత్రం వద్ద నెల్లూరు జిల్లా అర్బన్ ఆర్యవైశ్య సంఘం ఏర్పాటుచేసిన సన్మానసభకు విచ్చేశారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 30వ తేది రాత్రి నుంచి మాగుంట సుబ్బరామిరెడ్డి విగ్రహం వద్ద నుంచి టిటిడి కళ్యాణ మండపం వరకు కనులకింపుగా సీరియల్ సెట్లతో భవనాలన్నీ అలంకరించారు. కిలోమీటర్ మేర రోడ్డుకు చేసిన అలంకారానికి ముందు ట్రాన్స్‌కో అనుమతులు, తాత్కాలిక మీటర్ల ఏర్పాట్లు లేకుండా డైరెక్ట్‌గా మెయిన్‌లైన్ నుంచి విద్యుత్‌ను తస్కరించి వాడేశారు. తీవ్ర విద్యుత్ కోత కుదిపేస్తున్న ఈ రోజుల్లో ఈ విధంగా ముఖ్యమంత్రి పర్యటనకు అక్రమ కరెంట్ వాడడం విమర్శలకు తావిచ్చింది. దీన్ని ట్రాన్స్‌కో అధికారులు నిలువరించక పోవడం చర్చకు దారి తీసింది. ట్రాన్స్‌కో కొత్త ఎస్‌ఇ నందగోపాల్ మరీ అంతటి మెత్తటి ప్రసాదమైతే ఎలా?

**చూస్తూ ఊరుకొన్న ట్రాన్స్‌కో అధికారులు**

# ముఖ్యమంత్రికి మంచి కానుకలు


సిఎంను ప్రత్యేక హారంతో సన్మానించిన ప్రత్తి రవీంద్రబాబు కుటుంబం.

ముఖ్యమంత్రి రోశయ్య పెద్ద మనిషి, రుజువర్తనునిగా పేరుగాంచిన వ్యక్తి. అటువంటిది తన నెల్లూరు పర్యటనలో తేనీటి సేవనం, సన్మానసభ, షోరూం సందర్శనకు వెళ్లిన సమయంలో వారు చేసిన సత్కారాలు, స్వీకరించిన కానుకలు విమర్శలకు దారి తీసాయి. అర్బన్ ఆర్యవైశ్య సంఘం వేమాలశెట్టి బావి సత్రం దగ్గర ఏర్పాటుచేసిన సన్మానసభలో కాంగ్రెస్ పార్టీ తీర్థం స్వీకరించిన స్పందన ప్రసాద్ రోశయ్యకు స్వర్ణ కంకణధారణ చేయను సిద్ధపడగా ఆయన తిరస్కరించలేదు. ఈ కార్యక్రమానికి ముందు ముఖ్యమంత్రి వేదాయపాళెంలోని ఇండీవర్ షోరూంను సందర్శించారు. ఈ సందర్భంగా దాని నిర్వాహకులు రోశయ్యకు వజ్రాలు పొదిగిన వాచీ, విలువైన పట్టువస్త్రాలు సమర్పించారు. తేనీటి సేవనానికి తన ఇంటికి వచ్చిన ముఖ్యమంత్రికి ప్రత్తి రవీంద్రబాబు మంచి విలువైన బంగారు రంగు వేసిన వెండి మాలను మెడలోవేసి సంతోషపరచారు. సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి ప్రత్యేకంగా చేయించిన గజలక్ష్మిని సిఎంకు బహూకరించగా, ఆనం బ్రదర్స్ ఆర్యవైశ్యుల ఆరాధ్య దైవం వాసవీ కన్యకా పరమేశ్వరి వెండి విగ్రహాన్ని కానుకగా ఇచ్చారు. ముఖ్యమంత్రి చిన్ననాటి మిత్రుడు కె.వి.చలమయ్య మాత్రం తనను కుచేలుడితో పోల్చుకొని కానుకలివ్వకుండా తన ఇంటికి వచ్చిన రోశయ్యను ఖాళీ చేతులతో పంపారు. మాగుంట శ్రీనివాసులురెడ్డి మాత్రం ఘనమైన తేనీటి విందుతోనే రోశయ్యను వెనుకకు పంపడం విశేషం.

# విద్యావ్యాపారం

## ప్రకటనలు, రంగు రంగుల బ్రోచర్లతో బురిడి.

అన్ని వ్యాపారాలలో కెల్లా విద్యా వ్యాపారం నేడు లాభసాటిగా మారింది. తల్లితండ్రుల ఆశలను, విద్యార్థుల నమ్మకాన్ని తమ పెట్టుబడిగా చేసుకొని పలువురు విద్యాసంస్థల నిర్వాహకులు కోట్లకు పడగలెత్తుతున్నారు. రంగురంగుల బ్రోచర్లతో, ఆకర్షణీయమైన ప్రకటనలతో విద్యార్థులను, వారి తల్లితండ్రులను ఆకట్టుకొంటూ తమ పబ్బం గడుపుకొంటున్నారు. ఇందుకోసం వీరు అన్నిరకాల మార్కెటింగ్ సూత్రాలు పాటిస్తున్నారు. తమ విద్యాసంస్థల తరపున కొంతమంది సిబ్బందిని నియమించుకొని వారి ద్వారా విద్యార్థుల ఇళ్ల వద్దకు పోయి తమ సంస్థ గొప్పదని, తమకు స్టేట్ ర్యాంకులు, జిల్లా ర్యాంకులు వచ్చాయంటూ రకరకాల కరపత్రాలు చూపి వారిని మాటల గారడీతో మభ్యపెడుతున్నాయి. వీరి మాటలు నమ్మి ఆయా విద్యాసంస్థల్లో చేరిన విద్యార్థుల తల్లితండ్రులకు అధిక భారం వున్నా, విద్యా సంస్థలకు మాత్రం లక్షల రూపాయల ఆదాయం చేకూరుతుంది. స్పెషల్ డిస్కౌంట్‌ల పేరుతో వీరు ఇతర వ్యాపార సంస్థల మాదిరిగా రకరకాల ఆఫర్లు ప్రకటిస్తూ విద్యార్థులను చేర్చుకొంటుండడం వీరి ధనదాహానికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

# వేసవిలో ఆగని బోధన

## ప్రైవేట్ విద్యాసంస్థల తీరిది

వేసవిలో తరగతులను నిర్వహించరాదని ప్రభుత్వం స్పష్టమైన ఆదేశాలు జారీచేసి వున్నా ప్రైవేట్ విద్యా సంస్థలు వాటిని ఖాతరు చేయడం లేదు. ఏడాదిపాటు పుస్తకాలతో కుస్తీ పట్టిన విద్యార్థులకు ఆటవిడుపు వుండేందుకు వేసవి సెలవులను ఇచ్చే ప్రభుత్వం దానికి తగినట్లు కొన్ని నియమనిబంధనలను విధించింది. ఈ కాలంలో ఏ పాఠశాలకానీ, విద్యాసంస్థకానీ విద్యార్థులకు తరగతులను నిర్వహించరాదని స్పష్టంగా పేర్కొంది. ఈ ఆదేశాలను పుట్టగొడుగుల్లా వెలుస్తున్న విద్యాసంస్థలు పట్టించుకోవడం లేదు. విద్యావ్యాపారాన్ని కొనసాగిస్తున్న ఈ సంస్థలు వేసవిలో స్పెషల్ క్లాసులు, ప్రత్యేక తరగతులంటూ రకరకాల పేర్లు పెట్టి విద్యార్థులకు ఉదయం నుంచి సాయంత్రం వరకు క్షణం కూడా తీరిక లేకుండా చేస్తున్నాయి. బహిరంగంగా విద్యాసంస్థలు వేసవి తరగతులను నిర్వహిస్తున్నా విద్యాశాఖ, ఇంటర్ బోర్డు అధికారులు ఎవ్వరూ దీని గురించి పట్టించుకోక పోవడంతో ప్రభుత్వ ఆదేశాలు నీరుగారి పోతున్నాయి. విద్యార్థి సంఘాలు ఎంతగా గొంతు చించుకొని అరుస్తున్నా వారి వేదన అరణ్యరోదనవుతున్నదే తప్ప అధికారుల చెవికెక్కడం లేదు. మరోవైపు మానసికనిపుణులు సైతం విద్యార్థులకు వేసవిలో కాసింత విశ్రాంతినివ్వడం వల్ల ఒత్తిడి నుంచి బయటపడతారని చెప్తున్నా ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాలు మాత్రం వేసవి తరగతులను నిర్వహిస్తూనే వున్నాయి.


నెల్లూరులోని జైన్‌గోల్డ్ షోరూంలో వారం వారం నిర్వహిస్తున్న లక్కీడ్రాను తీస్తున్న పట్టణ సిఐ వీరాంజనేయరెడ్డి. ప్రక్కన షోరూం ఛైర్మన్ మణిలాల్‌జైన్.

# నిద్రావస్థలో వైద్య ఆరోగ్యశాఖ!

**వైద్య ఆరోగ్యశాఖలో పరిస్థితులు ఏ మాత్రం బాగాలేవు. సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు. నిధుల దుర్వినియోగం ఎక్కువయ్యింది. ప్రజలకు వైద్య సేవలు మృగ్యమయ్యాయి.**

పేదలకు వైద్య సదుపాయాలు అందించి వారి ఆరోగ్యాన్ని పరిరక్షించాల్సిన వైద్య, ఆరోగ్యశాఖ నిద్రావస్థలో వుంది. జిల్లావ్యాప్తంగా వున్న వైద్య సిబ్బంది ప్రజలకు బాధ్యతాయుతంగా వైద్యం చేయడం లేదు. ఒక ప్రక్క రాష్ట్రప్రభుత్వం కోట్ల రూపాయల నిధులు కేటాయించి పేద ప్రజలకు వైద్య సేవలు అందించాలని పదేపదే ఆదేశిస్తున్నా జిల్లా అధికార యంత్రాంగంలో ఎటువంటి మార్పు కానరావడం లేదు. అధికారులు అవలంభిస్తున్న విధానాలు ప్రజల పాలిట శాపంగా పరిణమించాయి.

## పి. హెచ్. సిల మూత

వైద్య సిబ్బంది పనితీరుపై తరచూ సమీక్షా సమావేశాలు నిర్వహించి సూచనలు, సలహాలు ఇస్తున్నా అవి అమలు కాకుండా పోతున్నాయి. జిల్లాలోని కొన్ని ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు ఎప్పుడూ మూత వేసి వుంటాయి. మరికొన్ని మధ్యాహ్నం వరకే తెరచి వుంటాయి. కొన్ని కేంద్రాలు సాయంత్రం వరకు వున్నా వాటిలో డాక్టర్లు, ఇతర సిబ్బంది కనిపించరు. గతంలో జిల్లా వైద్య, ఆరోగ్యశాఖలో కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలకు కేటాయించిన లక్షలాది రూపాయల నిధులు దుర్వినియోగం జరిగాయి. నిధులు దుర్వినియోగం గురించి పలుసార్లు విచారణలు జరిపినా బాధ్యులపై ఇప్పటివరకు చర్యలు తీసుకున్న దాఖలాల్లేవు.

## సిబ్బందిపై పట్టులేదు!

పరిపాలనపరంగా పట్టుకోల్పోవడంతో వైద్య, ఆరోగ్యశాఖ అస్తవ్యస్తంగా తయారయ్యింది. ఆ శాఖ ఉన్నతాధికారులు కూడా మెతక వైఖరి అవలంభిస్తున్నందున క్రిందిస్థాయిలో విధులు నిర్వహించే వైద్యులు, సిబ్బంది చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. నిధుల దుర్వినియోగం, పరిపాలన అదుపు తప్పడంతో ప్రభుత్వ వైద్యశాలల్లో విధులు నిర్వహించాల్సిన వైద్యులు నిత్యం ప్రైవేటు కార్యక్రమాలలో బిజీగా వుంటున్నారు. ఇటీవల జిల్లావైద్య ఆరోగ్యశాఖాధికారిగా బాధ్యతలు చేపట్టిన డాక్టర్ వెంకటరమణారెడ్డి వైద్య సిబ్బందిని గాడిలో పెట్టేందుకు కొంతమేర చర్యలు తీసుకుంటున్నా రాజకీయ ఒత్తిళ్ల కారణంగా కొన్ని ఇబ్బందులు ఎదురవుతున్నాయి.

గతంలో ఇక్కడి డిఎం అండ్ హెచ్‌ఓగా పని చేసిన ఆనంద్ అవినీతి అక్రమాలకు పాల్పడిన కార్యాలయ సిబ్బందికి మెమోలు జారీ చేయడం జరిగింది. దీనిని మనస్సులో పెట్టుకున్న సిబ్బంది ఆయన చాంబర్‌లోనే దాడి చేశారు. ఈ సంఘటనపై పోలీసులకు ఫిర్యాదు కూడా చేశారు. అయితే అనతికాలంలోనే ఆనంద్ జిల్లా నుంచి బదలీ కావాల్సి వచ్చింది. దీంతో ఈ కేసు గురించి పట్టించుకునే వారు లేకుండా పోయారు. ప్రస్తుతం వున్న డిఎం అండ్ హెచ్‌ఓ గతంలో అక్రమాలకు పాల్పడిన వారిపై చర్యలు తీసుకునేందుకు వెనుకంజ వేస్తున్నట్లు తెలుస్తుంది.

### చర్యలు తీసుకొంటాం!



విధుల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరించినా, నిధులు దుర్వినియోగం చేసిన వారిపై శాఖాపరంగా కఠిన చర్యలు వుంటాయి. నిధులు దుర్వినియోగం నా హయాంలో జరగలేదు. దీనిపై విచారణ చేసిన బృందం ప్రభుత్వానికి నివేదిక కూడా పంపింది. ప్రభుత్వం నుంచి ఆదేశాలు వస్తే చర్యలు తీసుకోవడం జరుగుతుంది.

*డాక్టర్ వెంకటరమణారెడ్డి*, డిఎంహెచ్‌ఓ

## నిధులు దుర్వినియోగం

కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌లకు సంబంధించిన దాదాపు 8లక్షల రూపాయల ఖర్చుకు లెక్కలు లేకుండా పోయాయి. హైదరాబాద్ నుంచి వచ్చిన ప్రత్యేక విచారణ బృందం సైతం నిధులు దుర్వినియోగం జరిగినట్లు నిర్ధారించింది. ఈ నిధులతోపాటు ప్రభుత్వ, ప్రైవేటు ఆసుపత్రులలో పురుడుపోసుకున్న వారికి పారితోషికంగా అందజేసే నిధులు కూడా దుర్వినియోగం జరిగినట్లు ఆరోపణలు వున్నాయి. ప్రభుత్వం అందజేసిన పారితోషికం పురుడుపోసుకున్న వారికి సకాలంలో అందజేయలేకపోవడంతో ప్రైవేటు వైద్యశాలల్లో కుటుంబనియంత్రణ ఆపరేషన్లు చేయించుకుంటున్నారే తప్ప, ప్రభుత్వ వైద్యశాలకు వెళ్లడం లేదు. దీంతో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలకు కేటాయించిన కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల లక్ష్యాలు నెరవేరకుండా పోతున్నాయి.

కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకున్న వారికి, ప్రైవేటు వైద్యశాలల్లో పురుడుపోసుకున్న వారికి వెంటనే పారితోషికం నగదును అందజేయాల్సి వుంటుంది. ట్యూబెక్టమి ఆపరేషన్‌కు 860 రూపాయలు, వ్యాసెక్టమీ ఆపరేషన్‌కు 1200 రూపాయలు, పురుడు పోసుకున్న వారికి 800 రూపాయలు ప్రభుత్వం మంజూరు చేస్తుంది. ఇందుకు సంబంధించి నిధులు కొరత లేకున్నప్పటికి నిధులు విడుదల చేయడంలోనూ, ఖర్చు చేయడంలోనూ వైద్య, ఆరోగ్యశాఖ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుంది. మరోప్రక్క గ్రామీణ ప్రాంతాలలో విధులు నిర్వహించే ఎఎన్‌ఎంలపై కుటుంబ నియంత్రణ ఆపరేషన్ లక్ష్యాలను సాధించాలని తీవ్రంగా ఒత్తిడి వుంటుంది.

గతంలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకున్న వారికి నగదు చెల్లించక పోవడం వలన ఆపరేషన్లు చేయించుకోవడానికి గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారు ముందుకు రావడం లేదన్నది ఎఎన్‌ఎంల ఆరోపణ. ఇదే విషయాన్ని జిల్లా అధికారుల దృష్టికి తీసుకెళ్లినా సమస్య పరిష్కారం కాలేదు. నిధులు వున్నా ఖర్చు చేసేందుకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల వైద్యులు కొందరు ఇష్టపడడం లేదు. ఎందుకంటే ఆపరేషన్లు చేయకుండానే చేసినట్లు పేర్లు నమోదు చేసి వున్న నిధుల్ని స్వాహా చేయవచ్చున్నది వీరి వుద్దేశంగా కనిపిస్తుంది. ఇదేవిధంగా గతంలో ఒకసారి ఆపరేషన్‌లు చేయించుకున్న వారి పేర్లను తిరిగి నమోదు చేసి నిధులు స్వాహాచేసిన సంఘటనలు వున్నాయి.

## ప్రైవేట్ ప్రాక్టీసులో బిజీ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో విధులు నిర్వహించే డాక్టర్లు ప్రైవేటు ప్రాక్టీస్ నిర్వహిస్తుంటారు. దీంతో ప్రభుత్వ నిధులకు సక్రమంగా హాజరు కాలేక పోతున్నారు. గ్రామీణప్రాంతాల ప్రజలు వైద్యం కోసం వచ్చి గంటల తరబడి నిరీక్షణ చేయాల్సిన దౌర్భాగ్యం ఏర్పడింది. కేవలం ఫార్మాసిస్టులే అన్నీ తామై రోగులకు వైద్యం అందిస్తున్నారు. మారుమూల ప్రాంతాల్లో ఏర్పాటు చేసిన ఆరోగ్య కేంద్రాలలో విధులు నిర్వహించాల్సిన డాక్టర్లు పట్టణపాంతాల్లో నివాసం వుంటూ తరచూ విధులకు డుమ్మా కొడుతున్నారు. ఎవరైనా ప్రశ్నిస్తే డాక్టర్ మీటింగ్‌కు వెళ్లారని సమాధానం వస్తుంటుంది.

డాక్టర్ల పనితీరుపై వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ ఇటీవల జరిగిన జిల్లాపరిషత్ సమావేశంలో లేవనెత్తారు. ఆసుపత్రికి ఎప్పుడు వెళ్లినా డాక్టర్ అందుబాటులో వుండరన్న విషయాన్ని ప్రజలు చెబుతున్నారని ఇక్కడ పని చేసే డాక్టర్ ప్రతిరోజు తిరుపతి నుంచి రాకపోకలు సాగించడం ఇందుకు కారణమని చెప్పుకొచ్చారు. ఎమ్మెల్యే లేవనెత్తిన అంశాన్ని అధికారులు పెద్దగా పట్టించుకోలేదు. సాధారణంగానే పరిశీలిస్తాం, చర్యలు తీసుకుంటాం అంటూ సమాధానం చెప్పి తప్పించుకున్నారు. ఈ సంఘటన కేవలం ఉదాహరణ మాత్రమే. ఇటువంటి పరిస్థితులు జిల్లావ్యాప్తంగా అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో నెలకొని వున్నాయి.



నెల్లూరులోని జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి కార్యాలయం.

## మందుల కేటాయింపులో మాయాజాలం!

ఇదిలా వుండగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు ప్రత్యేకంగా కేటాయిస్తున్న నిధులు కూడా సక్రమంగా వినియోగం జరగడం లేదు. ఆసుపత్రి అభివృద్ధి కమిటీ ఏర్పాటు చేసి ప్రజలకు అవసరమైన మందులు కొనుగోలు, గ్రామీణ ప్రాంతాలలో పారిశుద్ధ్యం నిర్మూలన

కొరవ 14వ పేజీలో



చీరాలలోని సహజ సాహితీ సంస్థ నెల్లూరుజిల్లా రచయితల సంఘం కార్యదర్శి పాతూరి అన్నపూర్ణను సాహితీ విశారద బిరుదుతో సన్మానిస్తున్న కార్యక్రమంలో ప్రముఖ కవి డాక్టర్ అద్దేపల్లి రామ్మోహన్‌రావు. ప్రకాశం జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు బి.హనుమారెడ్డి తదితరులు.



నెల్లూరు రైల్వే స్టేషన్‌లో ముఖ్యమంత్రికి స్వాగతం పలుకుతున్న రాజీవ్‌భవన్ నేత అనిల్‌కుమార్, మంత్రి రామనారాయణ, సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి.



ముఖ్యమంత్రి రోశయ్య నెల్లూరు పర్యటనలో సంతపేటలోని తన పాతమిత్రుడు కెవి.చలమయ్య గృహాన్ని సందర్శించినప్పుడు జరిగిన ఆత్మీయ సత్కారం.

# రికార్డు స్థాయిలో ఎగుమతులు!

● కృష్ణపట్నం పోర్టు ఘనత

కృష్ణపట్నం పోర్టులో ఒకేరోజు రికార్డుస్థాయి ఎగుమతులు జరిగాయి. దేశంలో ఎక్కడాలేని విధంగా 60వేల మెట్రిక్ టన్నుల ముడిఇనుము చైనాకు ఎగుమతి చేశారు. గతంలో 54వేల మెట్రిక్ టన్నులను ఎగుమతి చేసిన పోర్టు ఈసారి భారీగా ఎగుమతి చేయడం ద్వారా సరికొత్త రికార్డు సృష్టించింది. దీనికి సంబంధించిన వివరాలను సిఇఓ అనిల్‌కుమార్ తెలియజేస్తూ కృష్ణపట్నం పోర్టు నుంచి జరిగిన ముడిఇనుము ఎగుమతి ఒక రికార్డుగా అభివర్ణించారు. ఒక్కరోజులో 42,527 మెట్రిక్ టన్నుల బొగ్గు, 21,200 టన్నుల ఎరువులను దిగుమతి చేసుకొన్నామన్నారు. ప్రస్తుతం 5 బెర్తుల ద్వారా ఎగుమతి, దిగుమతులు చేస్తున్నామని, త్వరలో మరో మూడు బెర్తులను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ఈ ప్రాంతంలో పలు పోర్టు ఆధారిత పరిశ్రమలు వచ్చాయని, స్థానికులకు ఉద్యోగావకాశాలు కల్పించాలన్న ఉద్దేశ్యంతో సెక్యూరిటి అకాడమీ, డ్రైవింగ్ స్కూలు ఏర్పాటుచేస్తున్నట్లు వివరించారు. భవిష్యత్తులో మరింతగా అభివృద్ధి కార్యక్రమాలను చేపడుతున్నట్లు చెప్పారు.

● ఎమ్పిపికి

# బూడిద సెగ!

తొటపల్లి గూడూరు ఎంపిపిగా చక్రం తిప్పిన టంగుటూరు శ్రీనివాసులరెడ్డికి రిలయన్సు బూడిద ప్లాంటు సెగ పదవికే ఎసరు తెచ్చింది. మండవం గ్రామంలో రిలయన్సు సంస్థ యాష్‌పాండ్ నిర్మాణానికి అన్ని ఏర్పాట్లు చేసుకొన్నారు. దీనికి సంబంధించి భూసేకరణ, పరిహారం చెల్లింపుల్లో సర్పంచ్ సుబ్బారావు, ఎంపిపి ప్రధానపాత్ర పోషించారు. యాష్‌పాండ్ ఏర్పాటుకు మండవం గ్రామపంచాయితీ అనుమతి ఇవ్వాల్సి వుండగా వీరిద్దరూ కాలయాపన చేస్తూ వచ్చారు. రిలయన్సు నిర్వాహకులు ఈ విషయాన్ని ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి దృష్టికి తీసుకొని వచ్చారు. దీంతో ఆదాల, శ్రీనివాసులరెడ్డిని పిలిచి మందలించారు.

## రాజీనామా చేసిన టంగుటూరు

అందరి ముందు ఎమ్మెల్యే చీవాట్లు పెట్టడంతో అవమానించినట్లు భావించిన ఆయన తన పదవికి రాజీనామా చేశారు. గత ఎన్నికలలో జరిగిన ఒప్పందం ప్రకారం రెండున్నర సంవత్సరాలకే శ్రీనివాసులరెడ్డి పదవి నుంచి వైదొలగాల్సి వుండగా ఆయన దాన్ని పట్టించుకోకుండా కొనసాగుతూ వున్నారు. ఎమ్మెల్యే సైతం దీనిని చూసీచూడనట్లు వదిలేశాడు. ఇప్పుడు యాష్‌పాండ్ దెబ్బకు పదవి వీడాల్సి వచ్చింది. చాలాకాలంగా ఈ పదవిపై ఆశపెట్టుకొని వున్న చిన్నచెరుకూరుకు చెందిన కోడూరు విష్ణువర్ధన్‌రెడ్డి ఇప్పుడు ఏ నిర్ణయం తీసుకొంటారోనని అనుచరులు ఎదురు చూస్తున్నారు.

● దళారుల చేతుల్లో

# కావలి రియల్ ఎస్టేట్

దళారుల చక్రబంధంలో రియల్‌ఎస్టేట్ వ్యాపారాలు నడుస్తుండడంతో కొనుగోలుదారులు తీవ్రంగా నష్టపోతున్నారు. లేని ధరను సృష్టించి విపరీతంగా పెంచి అరచేతిలో స్వర్గాన్ని చూపెడుతూ రియల్ ఎస్టేట్ వ్యాపారాన్ని తమ చెప్పుచేతుల్లోకి తీసుకొనడంతో భూముల ధరలకు రెక్కలు వస్తున్నాయి. కావలి ప్రాంతంలో ఈ దోపిడీ అధికంగా వుంది. కేవలం చేతులు మార్చి లక్షలు గడిస్తుండడంతో భూముల ధరలు అడ్డూ ఆపు లేకుండా పెరిగిపోతున్నాయి. కావలి పట్టణంతోపాటు పరిసర గ్రామాలైన ముసునూరు, మద్దూరుపాడు, సర్వాయపాలెం, బుడమగుంట పంచాయితీలతోపాటు కావలి డివిజన్‌లోని వింజమూరు, కలిగిరి, జలదంకి మండలాల్లో రియల్ ఎస్టేట్ వ్యాపారం జోరందుకొంది. కమీషన్లకోసం దళారులే ధరలను పెంచి కొనుగోలుదారులను మభ్యపెట్టి అమ్మకాలకు సిద్ధమవుతుండడంతో సామాన్యులు భూములు, ప్లాట్లు కొనాలంటేనే హడలిపోతున్నారు.

వాడివేడిగా ముత్తుకూరు

# మండల మీట్

ముత్తుకూరు మండలంలోని పేదలకు ఇళ్ల నివేశన స్థలాలకు ఎంపిక చేసే ఇందిరమ్మ గ్రామ కమిటీలపై అధికారులు, సభ్యుల మధ్య వాగ్వివాదం చోటు చేసుకొంది. ఎంపిపి మారుబోయిన లక్ష్మమ్మ అధ్యక్షతన జరిగిన మండల సర్వసభ్య సమావేశంలో ఈ అంశంపై వాడివేడిగా చర్చ జరిగింది. తహశీల్దార్ ఉమాదేవి మాట్లాడుతూ ఇందిరమ్మ పథకానికి సంబంధించిన ఇళ్ల నివేశన స్థలాలు పొందే లబ్ధిదారుల వివరాలను ఇందిరమ్మ కమిటీలు అందజేయాలని సూచించారు. దీనికి మండల ఉపాధ్యక్షుడు పబ్బారెడ్డి బలరామకృష్ణారెడ్డి తీవ్రంగా స్పందించాడు.

## ఇందిరమ్మ కమిటీలపై వాగ్వివాదం

ఇళ్ల నివేశనస్థలాల ఎంపికలో ఇందిరమ్మ కమిటీలు పక్షపాతంతో వ్యవహరిస్తున్నాయని ఆరోపించారు. స్థలాల ఎంపికలో పంచాయితీ పాలకవర్గాన్ని కూడా భాగస్వామ్యం చేయాలని డిమాండ్ చేశారు. దీనికి తహశీల్దార్ ఉమాదేవి, ఎంపిడిఓ శ్రీహరి అభ్యంతరం వ్యక్తం చేశారు. జడ్పీటిసి సభ్యుడు వెంకటరమణయ్య అధికారులకు మద్దతు తెలపడంతో సమావేశంలో గందరగోళం నెలకొంది.

కావలి పట్టణంలో గల కార్మికశాఖాధికారి కార్యాలయం గత మూడునెలలుగా మూతపడి వుంది. అటు అధికారి, ఇటు సిబ్బంది లేక కార్యాలయం తెరచుకోకపోవడంతో పలు సమస్యలపై కార్యాలయానికి వచ్చే అసంఘటితరంగ కార్మికులు పలు అవస్థలు పడుతున్నారు. ఎప్పుడు చూసినా కార్యాలయానికి వేసిన తాళాలు వేసినట్టే వుంటున్నాయి. గతంలో ఓ మహిళా అధికారి పనిచేసే కాలంలో

## కావలిలో మూతపడ్డ లేబరాఫీసు

నిత్యం అందరితో సంబంధబాంధవ్యాలు కల్గివుండేవారు. కార్మికుల బాగోగులు, బీమా పథకాలపై చర్చించేవారు. ఆమె బదలీ అయిన నాటి నుంచి క్రొత్తగా వచ్చిన అధికారి ముఖం ఎవ్వరూ చూడలేదట. అధికారే కార్యాలయానికి రాకపోవడంతో సిబ్బంది అసలు రావడమే మానుకొన్నారు. జిల్లా కార్మిక శాఖాధికారి స్పందించి కావలి కార్యాలయాన్ని తెరపించి కార్మికులకు అందుబాటులోకి తీసుకరావాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# వరిసాగుకు ముందు భూసార పరీక్ష

( విడవలూరు వ్యవసాయాధికారి సూచన )

వరిసాగు చేపట్టడానికి ముందు ఆయా పొలాల్లోని మట్టిని భూసార పరీక్షలు చేయించాలని విడవలూరు మండల వ్యవసాయాధికారి కుప్పయ్య సూచించారు. మండలంలోని వ్యవసాయ కార్యాలయంలో జరిగిన ఆదర్శరైతుల సమావేశంలో ఆయన రైతులకు పలు సూచనలు, సలహాలు అందజేశారు. రైతులు తమ పొలాల్లోని మట్టిని సేకరించి పరీక్షలకు పంపడం ద్వారా సూక్ష్మధాతు లోపాలను నిర్ధారణ చేసుకొని సాగు చేపట్టినట్లయితే అధిక దిగుబడులు సాధించవచ్చన్నారు. ఖరీఫ్ సీజన్‌లో వరిసాగుకు మండలంలో ఇప్పటికే 2500 ఎకరాల్లో నారుమళ్లను సిద్ధం చేశామన్నారు. ఎం7 లావులు, సన్నాలు, ఎంటియు1010, ఎన్‌ఎల్ఆర్ 34449 జిలకర మసూరి రకాలు సాగుకు అనుకూలమని తెలిపారు. పంచాయితీ పరిధిలోని బ్లాక్ బోర్డుల్లో ఈ విషయాలను కనపరుస్తామని ఆదర్శరైతులు సహకరించాలని కోరారు. ఈ సమావేశంలో మండల విస్తరణ అధికారి కల్పన, పశువైద్యాధికారి హర్షవర్ధన్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరులోని నేతాజీ ఫౌండేషన్, తిక్కన రచయితల సంఘం సంయుక్త ఆధ్వర్యంలో మేడే రోజు జరిగిన అన్నదాన కార్యక్రమంలో మాట్లాడుతున్న సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి. ప్రక్కన ప్రావిడెంట్ ఫండ్ రిటైర్డ్ కమీషనర్ వి.అరుణాచలం, సుబ్రహ్మణ్యశాస్త్రి, గానుగపెంట హనుమంతరావు, మురళీమోహన్‌రాజు.




నెల్లూరు పట్టణంలో మేడే సందర్భంగా ప్రదర్శన చేస్తున్న సిపిఎం నేతలు మోహన్‌రావు, డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు, అజయ్‌కుమార్, కార్పొరేటర్లు షాహినాబేగం, మస్తాన్‌బీ, కత్తి శ్రీనివాసులు.

● సేంద్రీయ వ్యవసాయానికి

## హామీలేని రుణం!

సేంద్రీయ ఎరువులతో పంటలు పండించే రైతులకు ఎలాంటి హామీ లేకుండా ఐదు నుంచి పదిలక్షల వరకు రుణ సహాయాన్ని అందజేయనున్నట్లు డిఆర్‌డిఏ ఎపిడి నరసింహారావు తెలియజేశారు. కోవూరులో సంఘమిత్ర కార్యాలయాన్ని తనిఖీ చేసిన ఆయన మాట్లాడుతూ స్వయం సహాయక సంఘాల్లోని సభ్యుల ఆర్థికాభివృద్ధిని దృష్టిలో వుంచుకొని పొదుపు సంఘాల్లో సభ్యులుగా వున్న రైతులకు ఈ రుణాలను అందజేస్తామన్నారు. ఇప్పటివరకు ఐదు లక్షల రూపాయల రుణాలను స్వయం సహాయ గ్రూపులకు ఇచ్చేవారమని, ఇక నుంచి ఈ మొత్తాన్ని 10లక్షల వరకు పెంచేందుకు ఉన్నతాధికారులకు ప్రతిపాదనలు పంపామన్నారు.

జిల్లాలో తొలివిడతగా ఈ పథకాన్ని దగదర్తి, కావలి, ముత్తుకూరు, రాపూరు, ఉదయగిరి, దుత్తలూరు, మర్రిపాడు, జలదంకి తదితర మండలాల్లో అమలు చేయనున్నట్లు తెలిపారు.

● అభివృద్ధికి

## ఆమడ దూరం!

చేనేత వస్త్రాలు, నిమ్మకాయల ఉత్పత్తుల్లో దేశవ్యాప్తంగా పేరు గడించిన వెంకటగిరి ప్రాంతంలో మిగతా అభివృద్ధి కార్యక్రమాల సంగతి ఎలా వున్నా టెలికాం, రైల్వే, తపాలా రంగాల్లో మాత్రం వెనుకబడి వుంది. ప్రజాప్రతినిధులు ఆ వైపుగా దృష్టి సారించకపోవడంతో ప్రజలకు మెరుగైన సౌకర్యాలు అందడం లేదు. ఉత్తర భారతదేశానికి నిమ్మకాయలను రవాణా చేయడానికి రైళ్లలో కేటాయించిన వ్యాగన్ల కోటా చాలడం లేదు. ఈ కారణంగా లారీల్లో

**వెంకటగిరిలో టెలికాం, రైల్వేశాఖల తీరిది!**

ఎగుమతులు చేయాల్సి వస్తోంది. స్టేషన్‌లో ద్విచక్రవాహనాలు నిలిపేందుకు, నిమ్మకాయల బస్తాలు వుంచుకొనేందుకు స్థలం లేదు. టెలికాం రంగానికి సంబంధించి గ్రామాల్లో ఫోన్లు సక్రమంగా పని చేయడం లేదు. బిఎస్ఎన్ఎల్ టవర్ వున్నా తగినంత సామర్థ్యం లేనందువల్ల తరచూ అంతరాయం ఏర్పడుతోంది. ప్రజలకు సేవలందించే తపాలా కార్యాలయం శిథిలమై వుంది. పోస్టుబాక్సులు తుప్పుపట్టి వున్నాయి. వీటి స్థానంలో క్రొత్తవాటిని ఏర్పాటు చేయాల్సి వున్నా ఆ దిశగా చర్యలు లేవు. పలు గ్రామాల్లో సిబ్బంది కొరత వుంది. ప్రజలకు ముఖ్యమైన ఈ మూడు శాఖలను మరింతగా అభివృద్ధి చేయాలని వెంకటగిరి ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.

## ఉపాధిహామీ నిధులతో తోటల పెంపకం!

**- డ్వామా పిడి వెల్లడి**

జాతీయ ఉపాధిహామీ పథకం క్రింద జిల్లాలో ఆరు వేల ఎకరాలను అభివృద్ధి చేసి ఉద్యాన తోటలను సాగు చేయనున్నట్లు డ్వామా పిడి రామిరెడ్డి తెలిపారు. పొదలకూరు మండలం పులికల్లు గ్రామంలో అభివృద్ధి చేయనున్న భూములను పరిశీలించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ జిల్లాలో ఇప్పటివరకు 2500 ఎకరాల్లో భూమిని అభివృద్ధి చేసి సాగులోకి తెచ్చినట్లు తెలిపారు. ఈ పథకం క్రింద భూమిని సాగుకు అనువుగా తయారుచేయడంతోపాటు నీటి వసతి, విద్యుత్ సౌకర్యాన్ని కల్పిస్తామన్నారు. వాటిలో ఉద్యాన తోటలకు ప్రాధాన్యమిస్తామన్నారు. ఒక్కో ఎకరాను అభివృద్ధి చేసుకొనేందుకు ఎకరాకి 12వేలు, డ్రిప్‌కు 25వేల నుంచి 30 వేల రూపాయలు చెల్లిస్తామన్నారు. పులికల్లు గ్రామాన్ని ఆదర్శ గ్రామంగా ఎంపిక చేసినట్లు ప్రకటించారు.

## సహకార సంఘాల పనితీరు బేష్!

జిల్లాలో సహకార సంఘాల పనితీరు సంతృప్తికరంగా వుందని డిసిసిబి జనరల్ మేనేజర్ మదన్‌మోహన్ తెలిపారు. తోటపల్లి గూడూరు సొసైటీ ఆధ్వర్యంలో బంగారు నగలపై రుణ పథకాన్ని ప్రారంభించిన ఆయన సొసైటీ అధ్యక్షుడు కోడూరు శ్రీనివాసులరెడ్డితో కలిసి పలు అంశాలపై మాట్లాడారు. వైద్యనాథన్ కమిటీ సిఫార్సులకు అనుగుణంగా 62 సొసైటీలను పటిష్టపరచి రైతులకు అందుబాటులోకి తెచ్చామన్నారు. జిల్లా వ్యాప్తంగా 3లక్షల 50వేల సభ్యత్వం కలిగి వున్నామని, రైతులకు 50వేల వరకు రుణ సదుపాయం కల్పిస్తున్నామన్నారు. విలుకానిపల్లెలో క్రొత్తగా గిడ్డంగిని, సాలిపేట సొసైటీ ద్వారా కళ్యాణమండపం నిర్మిస్తున్నట్లు సొసైటీ అధ్యక్షుడు శ్రీనివాసులరెడ్డి తెలియజేశారు.

## మంత్రితో రాఘవ చెట్టాపట్టాల్!

● ఆత్మకూరులో మారిన రాజకీయం

శాసనమండలి సభ్యుడు బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డిది మొదటి నుంచి ప్రత్యేకశైలి. అవసరాలకు అనుగుణంగా రాజకీయాలు నెరపడం, పార్టీలు మారడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. ఏడాది క్రిందట జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో ఆత్మకూరు నుంచి ప్రజారాజ్యం పార్టీ తరపున ఖాజావలిని పోటీ చేయించి ముస్లిం ఓట్లు రాబట్టేందుకు ప్రయత్నించి విఫలమయ్యాడు. అప్పటి నుంచి మోహం చాటేసిన రాఘవ మంత్రి ఆనం రామనారాయణరెడ్డితో చెట్టాపట్టాల్ వేసుకొని తిరగడం చూసి జనం అవాక్కయ్యారు. ఆత్మకూరులో పర్యటించిన మంత్రి వెంట రాఘవేంద్రరెడ్డి వుండడాన్ని చూసిన పలువురు ఆయనేదో క్రొత్త ఎత్తు వేశాడని బహిరంగంగానే వ్యాఖ్యానిస్తున్నారు. ఏడాది లోపు తన ఎమ్మెల్సీ పదవీ కాలం పూర్తికానుండడం, మరో వైపు స్థానిక సంస్థల నుంచి శాసనమండలికి జడ్పీఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి పోటీ చేస్తారని ప్రచారం జరుగుతున్న నేపథ్యంలో మంత్రి రామనారాయణ సహకారంతో తిరిగి పదవి పొందేందుకే బొమ్మిరెడ్డి పావులు కదుపుతున్నారని రాజకీయ విశ్లేషకులు అభిప్రాయపడుతున్నారు.

● పొదలకూరులో

## ప్రభుత్వ స్థలాల కబ్జా!

పొదలకూరు పట్టణంతో పాటు పరిసర ప్రాంతాల్లో భూఆక్రమణలు రోజురోజుకు అధికమౌతున్నాయి. విలువైన ప్రభుత్వ స్థలాలు కబ్జాలకు గురౌతున్నా పట్టించుకొనేవారే లేకుండాపోయారు. రియల్ ఎస్టేట్ వ్యాపారానికి అనువుగా వుండడంతో నెల్లూరు రోడ్డులోని తోడేరు, చాటగుట్ల గ్రామపంచాయితీల్లోని భూముల ధరలకు రెక్కలు వచ్చాయి. దీంతో రియల్‌ఎస్టేట్ వ్యాపారులు భూమి ప్రక్కనే వున్న నీటి పారుదల కాలువలు, రోడ్డు, ప్రభుత్వ భూమిని ఆక్రమించేసుకొంటున్నారు. పొదలకూరు పరిసర ప్రాంతాల్లో అక్రమ లేఅవుట్‌లు ఇబ్బడిముబ్బడిగా వెలుస్తున్నాయి. చిట్టేపల్లిగ్రామంలో ఒక వ్యాపారి ప్రభుత్వభూమిని కబ్జా చేయగా గ్రామస్తులు అధికారులకు ఫిర్యాదు చేయడంతో ఆ వ్యాపారి గ్రామంలో ఆలయ నిర్మాణానికి సమ్మతించి ఐదు లక్షల రూపాయలు

**పట్టించుకొనే అధికారి లేడు**

చెల్లించి రాజీ కుదుర్చుకొన్నాడట. ఇలాంటి ఆక్రమణలు మండలంలో జరుగుతున్నా పంచాయితీ, రెవెన్యూ అధికారులు పట్టించుకోకపోవడంతో కబ్జాదారుల ఆగడాలకు అంతే లేకుండా పోయింది.

కసుమూరు కొండపై

## మోటారు దొంగతనం!

వెంకటాచలం మండలం కసుమూరు కొండమీద ప్రజల దాహార్తిని తీర్చేందుకు ఏర్పాటు చేసిన మోటారు దొంగతనానికి గురికావడంతో మంచినీటి పథకం నిరుపయోగంగా మారింది. గిరిజన కాలనీ వద్ద ఆరు లక్షల రూపాయల వ్యయంతో మంచినీటి పథకాన్ని ఏర్పాటు చేశారు. అరుంధతీయవాడ, కొండమీద గిరిజన కాలనీలకు ఈ పథకం ద్వారా నీటి సరఫరా చేస్తారు. అయితే దీనికి బిగించిన మోటార్‌ను నెలరోజుల క్రిందట గుర్తు తెలియని వ్యక్తులు దొంగిలించుకపోయారు. మోటారుతోపాటు విలువైన పైపులు చోరీకి గురయ్యాయి. దీంతో ఆయా గ్రామాలకు నీటిసరఫరా నిలిచిపోయింది. స్థానికులు ఈ విషయాన్ని మండల అధికారులకు, పోలీసులకు ఫిర్యాదు చేశారు. క్రొత్త మోటారును ఏర్పాటు చేసేందుకు అధికారులు చర్యలు తీసుకోకపోవడం, పోలీసులు దొంగలను పట్టుకోకపోవడంతో గ్రామస్తులు మంచినీటి కోసం అల్లాడుతున్నారు.



# పసిడి పండుగ అక్షయ త్రితియ!



అక్షయం అంటే క్షయం లేనిది. జీవితంలో అన్నింటినీ అక్షయం చేసే పర్వదినం కాబట్టే దీనికి అక్షయ త్రితియ అనే పేరు వచ్చింది. వైశాఖ మాసంలో శుక్లపక్ష తదియనాడు ఈ పండుగను జరుపుకొంటారు. ఈ పండుగ గురించి, ఆనాడు ఆచరించాల్సిన విధివిధానాలను భవిష్య, శివ పురాణాల్లో వివరించారు. వైశాఖ శుద్ధ తదియ నాడు కృతయుగం, కార్తీక శుక్ల నవమినాడు త్రేతాయుగం, బాధ్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపరయుగం, మాఘబహుళ అమావాస్య నాడు కలియుగం ఆరంభమైందని విష్ణు పురాణం చెబుతోంది. కృతయుగం ప్రారంభమైన రోజును అక్షయ త్రితియగా జరుపుకొంటారు. బదరి నారాయణ స్వామి ఆలయాన్ని ఆ రోజున తెరుస్తారు.

ఉత్తర భారతంలో ఈ పండుగనాడు లక్ష్మీపూజ చేస్తారు. అక్షయ త్రితియనాడు బంగారం కొనుగోలుచేసి ఇంటికి తెచ్చుకొన్నట్లయితే లక్ష్మీదేవి ఆయా గృహాల్లో స్థిరనివాసం ఏర్పరచుకొంటుందని పలువురి నమ్మకం.



## బహుమతిగా స్కూటీ

అక్షయ త్రితియ పండుగను దృష్టిలో వుంచుకొని కొనుగోలుదారులకు లక్కీడ్రా నిర్వహించి విజేతలకు స్కూటీని అందజేస్తున్నాం. పండుగ రద్దీని దృష్టిలో వుంచుకొని ముందుగా బుక్‌చేసుకొనే సదుపాయం కల్పిస్తున్నాం. నూతన ఆభరణాలు పలు డిజైన్లలో అందుబాటులో వున్నాయి.

**మణిలాల్‌జైన్,** *జైన్‌గోల్డ్*

## డబుల్ ధమాకా!

అక్షయ త్రితియ, షోరూం వార్షికోత్సవాలను పురస్కరించుకొని డబుల్ ధమాకా ఆఫర్‌ను ప్రవేశపెట్టాం. బంగారు నగలపై గ్రాముకు 100 రూపాయలు, డైమండ్స్‌పై 13% తగ్గింపు ఇస్తున్నాం. అక్షయ త్రితియనాడు బంగారం కొంటే సకల శుభాలు కల్గుతాయి.

**శాంతిలాల్‌జైన్,** *శాంతిలాల్ జ్యూయలరీ*

## లక్ష్మీదేవిని ఆహ్వానించినట్లే!

అక్షయ త్రితియ నాడు బంగారం కొంటే లక్ష్మీదేవిని ఇంటికి ఆహ్వానించినట్లే. ఈ సందర్భంగా మేము అక్షయ వృక్షం స్కీంను ప్రవేశపెట్టాం. 12 నెలల పాటు కట్టే డబ్బుకు సరిపడా బంగారాన్ని అందజేస్తాం. స్కీంలో చేరే సభ్యులకు లక్ష్మీదేవి కాయిన్‌ను ఉచితంగా అందజేస్తాం.

**లలిత్‌జైన్,** *న్యూ ఆంధ్రా జ్యూయలరీ*

## శుభం కల్గుతుంది

అక్షయ త్రితియ పర్వదినం రోజు బంగారు కొంటే అష్టైశ్వర్యాలు కలుగుతాయని పురాణాలు చెబుతున్నాయి. ప్రజలూ అదే నమ్మకంతో వున్నారు. ఈ సందర్భంగా మేము బంగారు కొనుగోలుపై సవరకు 400 రూపాయలు, డైమండ్స్‌పై 10% తగ్గింపు ఇస్తున్నాం.

**సంజయ్ జైన్,** *గోల్డ్‌ప్యాలెస్*

## బహుమతుల వెల్లువ

షోరూం నూతన ప్రారంభం సందర్భంగా ఏడువేల రూపాయలకు కొనుగోలు చేసిన మా కస్టమర్లకు లక్కీ డ్రా తీసి బహుమతులు ఇస్తున్నాం. జూన్‌లో జరిగే బంపర్ డ్రాలో విజేతకు హోండా సిటీ కారు, నలుగురికి నానో కార్లు, మరో నలుగురికి పల్సర్ బైక్‌లు అందజేయనున్నాం.

**ధరేంద్రజైన్,** *సిల్వర్ ప్యాలెస్*

---

## 'చిరు' ప్రయాస

చలో పోలవరం

రాజకీయాల్లో 'ప్రజారాజ్యం' ఫ్లాప్ అయినా ఆ పార్టీ అధ్యక్షుడు చిరంజీవి మాత్రం రాజీ పడేలా కనిపించడం లేదు. ఇప్పటికే సీనియర్లంతా తట్టాబుట్టా సర్దుకొని పూర్వాశ్రమాలకు దారికట్టారు. త్వరలోనే మరికొందరు కూడా తెలుగుదేశంలోకి దూకేయడానికి సిద్ధంగా వున్నారు. చిరంజీవి మాత్రం ఇవేం పట్టించుకోకుండా 'పోలవరం' యాత్ర చేస్తున్నాడు. సముద్రంలో కలవకుండా నదీజలాల్ని సద్వినియోగం చేసుకోడానికి 'పోలవరం' ప్రాజెక్టును కట్టాల్సిందేనని 'చిరు' అంటున్నాడు. అంతేకాదు పోలవరాన్ని జాతీయ ప్రాజెక్టుగా గుర్తించి కేంద్ర ప్రభుత్వం సాయం చేయాలని ఒత్తిడి తెచ్చేందుకు 'చలో పోలవరం' యాత్రకు శ్రీకారం చుట్టాడు. పోలవరం నిర్మాణాన్ని తెలంగాణవాదులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నా 'చిరు' మాత్రం సీరియస్‌గా తీసుకున్నాడు. మొత్తం మీద 'తెలంగాణ' దూరమైనా ఫర్వాలేదు కానీ నదీజలాల సద్వినియోగానికే నా ఓటు అంటూ ఉడుంపట్టు పట్టున్నాడు. ఎంతైనా 'మెగా' స్టార్ కదా!

## గవర్నర్‌కు నారాయణ వత్తాసు

రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఏం బాగోలేదంటూ గవర్నర్ నరసింహన్ ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు నివేదికలు పంపించారన్న ఆరోపణపై వివిధ వర్గాల నుంచి అనేక విమర్శలు వచ్చాయి. అయితే సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ నుంచి మాత్రం గవర్నర్‌కు గట్టి మద్దతు లభించింది. గవర్నర్ అంటే రబ్బర్ స్టాంప్‌గా వుండాలా? లేక ఎన్టీఆర్‌ను గద్దె దింపి వెన్నుపోటుదారుడైన నాదెండ్లను సిఎంగా చేసిన రామ్‌లాల్ లాగా వుండాలా? లేక రాసలీలలు చేసి గబ్బుపట్టిన తివారీలా వుండాలా? అంటూ కాస్తంత వ్యంగ్యంగానే నరసింహన్‌ను సమర్థించాడు. గవర్నర్‌కు రాష్ట్ర ఆర్థిక పరిస్థితిపైనే కాదు ఏ విషయాలపైన అయినా ప్రధానికి నివేదికలు పంపే అధికారం వుందంటూ నరసింహన్‌ను కాపు కాశాడు. ఊరంతా ఓదారైతే ఉలిపి కట్టెది మరోదారి అన్నట్లుంది నారాయణ వ్యవహారం అంటూ గవర్నర్‌ను వ్యతిరేకించేవారు చెవులు కొరుక్కుంటున్నారు.

## ఢిల్లీ చుట్టూ చక్కర్లు

ఈ నెల 7వ తేదిన ముఖ్యమంత్రి ఢిల్లీకి వెళ్తుండటంతో మంత్రి పదవులపై ఆశలు పెంచుకున్నవారంతా చలో ఢిల్లీ అంటూ విమానాలెక్కేస్తున్నారు. ఎప్పటినుంచో వాయిదా పడుతున్న రాష్ట్ర మంత్రివర్గ విస్తరణ ఈసారి తప్పక జరుగుతుందని ఆశావహులంటున్నారు. కాగా ప్రస్తుత మంత్రుల్లో చాలా మందికి 'పదవీ గండం' వుందన్న సూచనలందడంతో వారు కూడా ఢిల్లీ పెద్దల దగ్గర క్యూకడుతున్నారు. రోశయ్య మాత్రం ఇప్పటిదాకా మంత్రివర్గం మార్పు చేర్పులు ఎలా వుండబోతున్నాయో సూచనప్రాయంగా కూడా చెప్పడం లేదు. దీంతో 'సస్పెన్స్' భరించలేని ఎమ్మెల్యేలు, మంత్రులు ఒత్తిడికి గురవుతున్నారు. అయితే త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలు జరగనున్న దృష్ట్యా మంత్రివర్గం తేనెతుట్టెను ఇప్పుడు కదుపుతారా? అన్న మీమాంస కూడా కొందరిలో వుంది. చూద్దాం... రోశయ్య ఏం చేస్తారో!

## హెలికాప్టర్‌పై మంత్రుల లొల్లి

సిఎంతోపాటు హెలికాప్టర్ ఎక్కడానికి మంత్రులు పోటీ పడుతుండటంతో ప్రభుత్వ అధికారులకు తలనొప్పిగా మారింది. కొన్ని జిల్లాల్లో ముగ్గురేసి వంతున మంత్రులున్నారు. వారితోపాటు జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి అదనంగా వున్నారు. ఇటువంటి జిల్లాల్లో సిఎం పర్యటించే సమయంలో ఆయనతో పాటు హెలికాప్టర్ ఎక్కడానికి మంత్రులు పోటీ పడుతున్నారు. హెలికాప్టర్‌లో మంత్రులందర్నీ ఎక్కించడం కుదరదంటూ సిఎం సెక్యూరిటీ సిబ్బంది అడ్డం చెబుతున్నారు. దీంతో మంత్రుల 'ఇగో'లు దెబ్బతిని మనస్పర్థలు ఏర్పడుతున్నాయట. దీన్ని దృష్టిలో పెట్టుకొని రాష్ట్ర ప్రభుత్వ చీఫ్ సెక్రటరీ ఎస్‌వి.ప్రసాద్ తాజాగా ఓ జీవోను జారీ చేశాడు. ఇకపై సిఎం హెలికాప్టర్ ఎక్కడానికి సీనియర్ మంత్రిని మాత్రమే అనుమతిస్తారట. అయితే కొన్ని జిల్లాల్లో ఎవరు సీనియరో? ఎవరు జూనియరో తేల్చడం జిల్లా కలెక్టర్లకు అగ్ని పరీక్షగా మారిందంటున్నారు. ప్చ్... ఏం చేద్దాం!!

## అధిక వైశాఖ మాసంలో

# ఆధ్యాత్మిక జీవనం వుత్తమం!

ప్రతి మూడు సంవత్సరాలకు ఒకసారి అధిక మాసం వస్తుంది. చంద్రమాన వికృతినామ సంవత్సరంలో అధిక వైశాఖమాసం ఏప్రెల్ 15 నుంచి ఆరంభమై మే 14 వరకు వుండే ఈ మాసానికి స్వయంగా విష్ణు భగవానుడే అధిపతిగా వుంటాడని పురాణాలు చెప్తున్నాయి. అధికవైశాఖ మాసంలో నదీ స్నానాలు, పూజలు, వ్రతాలు, దానధర్మాలు అనుష్ఠాన పూర్వకంగా చేసినట్లయితే విష్ణుమూర్తి అనుగ్రహాన్ని పొందుతారని ప్రతీతి. అధిక వైశాఖంలో పెళ్లిళ్ల తదితర శుభకార్యాలకు నెలరోజులపాటు విరామం. ఈ కాలంలో శివకేశవులిద్దరినీ తప్పక ఆరాధించాలి. వందసంవత్సరాలు తపస్సు చేస్తే వచ్చే పుణ్యఫలం అధికమాసంలో ఒక్కరోజు జపతాపాలు, దానధర్మాలు చేస్తే లభిస్తుందని పురాణాలు చెప్తున్నాయి.

అధికమాసంలో వ్రతాలు, పూజలు చేసేవారు నిష్ఠతో చేయాలి. మాంసం, మత్తుపదార్థాలు, నువ్వుల నూనె, ఉల్లి, వెల్లుల్లి తదితర పదార్థాలకు దూరంగా వుండాలి. ప్రతిరోజూ ఒకరికి భోజనం పెట్టడం, గోపూజ చేయడం, దాన ధర్మాలు, వ్రతాలు ఆచరిస్తూ సహనంతో సాత్వికమైన జీవితం గడపాలి.

ఈ నెలలో దేవాలయాల్లో, పుణ్యక్షేత్రాల్లో భాగవతాది సప్తాహ కథా శ్రవణాలు, శివాలయాల్లో శివునికి ప్రీతికరమైన రుద్రాభిషేకాలు, తులసీదళాలతో సాలిగ్రామ పూజలు, విష్ణువుకు ప్రీతికరమైన సత్యదేవ వ్రతాలు, విష్ణు సహస్రనామ పారాయణం చేస్తారు. అధికమాసంలో శివకేశవుల ధ్యానంలో గడపడం, ఆధ్యాత్మిక జీవితాన్ని అనుసరించడం వల్ల శివానుగ్రహం పొందుతారు.

అధికమాసంలో నెలరోజులపాటు వివాహ, కేశఖండన, దేవతా ప్రతిష్ఠ, గృహప్రవేశం తదితర శుభకార్యాలు చేసుకోరాదు. మే 15 తేది నుంచి ప్రారంభమై జూలై 8వరకు వుండే నిజమాసంలో శుభకార్యాలు జరుపుకోవచ్చని వేద పండితులు చెప్తున్నారు. భారతీయ సాంప్రదాయాలను నియమబద్ధంగా ఆచరిస్తూ అధిక మాసంలో చేసే వ్రతాలు, పూజల వలన సకల శుభాలు కల్గుతాయి.

## ట్రంకు రోడ్డు

### జనం చెవుల్లో పువ్వులు!



రాజకీయ నాయకులు చేయని పనులను చేసినట్లు చెప్పుకోవడం అలవాటే. కాని ముఖ్యమంత్రి వున్న వేదిక మీద వేలమంది జనం సాక్షిగా అబద్ధాలు చెప్పిన ఘనతను మేయర్ భానుశ్రీ స్వంతం చేసుకొన్నారు. వి.ఆర్ కాలేజ్ మైదానంలో ముఖ్యమంత్రి రాక సందర్భంగా 2తేదీ ఏర్పాటుచేసిన సభలో నెత్తిపై టోపి పెట్టుకొని మాట్లాడిన మేయర్ జనం చెవుల్లో పువ్వులు పెట్టారు. నెల్లూరు నగరంలో రెండు పూటల నీళ్ల సరఫరా చేస్తున్నాం. మరో పక్షంరోజుల్లో నగరంలోని అన్ని ప్రాంతాలకు పెన్నా నీళ్ల ఇవ్వబోతున్నామనే సరికి సభలోని మహిళలు మరీ ఇంత పచ్చి అబద్ధాలా అంటూ తమలో తాము గుసగుసలాడుకొన్నారు. ఆమె మహిళలను వుద్దేశించి నా తోడబుట్టిన సోదరీమణులని అనడాన్ని మహిళలు జీర్ణించుకోలేక ఈమెకు మనం తోడబుట్టిన వాండ్లమా అంటూ వ్యాఖ్యానించడం కనిపించింది.

### జనం చూడబనిలేదా?



ఎన్టీరామారావు అభిమానిగా నెల్లూరు నగరంలో పేరుగాంచిన 'రమ్మీ'(రమేష్‌రెడ్డి) పూర్వాశ్రమంలో సినిమాహాళ్ళ వద్ద బ్లాక్ టిక్కెట్లు అమ్మేవాడని ఇప్పటికీ కథలు, కథలుగా చెబుతుంటారు. ఆ తర్వాత ఆయన మునిసిపల్ ఛైర్మన్, ఎమ్మెల్యే, మంత్రి కూడా అయ్యారు. కాని పుట్టుకతో వచ్చిన బుద్ధులు పోవుగదా? పాత రోజుల మాదిరి టిక్కెట్లు బ్లాక్ చేసే గుణాన్ని మానలేదు. గతవారం విడుదలైన బాలకృష్ణ నటించిన 'సింహా' సినిమా తాలుకు టిక్కెట్లను తన పలుకుబడి వుపయోగించి ఈయన స్వంతం చేసుకొన్నాడు. ఎన్టీఆర్ అభిమానులకు, తెలుగుదేశం పార్టీ కార్యకర్తలకే ఈ టిక్కెట్లను ఆయన అమ్ముకున్నారు. సినిమా విడుదలకు ముందే క్రేజ్ రావడంతో చూడాలని హాళ్ళ వద్దకు వెళ్లిన జనానికి 3తేదీ వరకు టిక్కెట్లు లేవన్న సమాధానం నిరాశపర్చింది. రమేష్‌రెడ్డిని తిట్టుకొంటూ సినిమా ప్రదర్శితమవుతున్న మూడు థియేటర్ల నుంచి జనం తిరిగి వచ్చారు. ఇటువంటి పనులతో క్రేజ్ తరగడమే కాని పెరగదు రమ్మీ.

### వృక్ష విలాపం



నెల్లూరు పొదలకూరు రోడ్డులోని పోలీసాఫీసు నుంచి ఎస్పీ బంగ్లా వరకు రోడ్డుకు ఇరువైపులా ఏపుగా చెట్లు పెరిగి వుండేవి. తెలుగుదేశం హయాంలో క్లీన్ అండ్ గ్రీన్ కార్యక్రమంలో వేసిన ఈ మొక్కలు మొత్తానికి మానులయ్యాయి. ముఖ్యమంత్రి రోశయ్యగారి నెల్లూరు పర్యటన ఈ మార్గం గుండా కొనసాగదంతో ఈ చెట్లపై ఎవరైనా క్లైమోర్‌మైన్‌లు పెడతారన్న శంకతో కొట్టి మోడులను చేశారు. శాస్త్రాల ప్రకారం వృక్షచేధన పాపం... ఈ పాప భారం ఎవరు మోయాల్సివస్తుందో?

### వచ్చి చేసిందేమిటి?



సిద్దడు అద్దంకికి వచ్చి వెళ్లాడన్న సామెతతో నెల్లూరుకు ముఖ్యమంత్రి రోశయ్య వచ్చి వెళ్ళడాన్ని పోల్చారు తెలుగుదేశం నేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. రోశయ్య తన 26 గంటల సింహపురి నగర పర్యటనలో కేవలం గంటన్నర సేపు మాత్రమే ప్రజలకోసం వినియోగించడాన్ని తప్పుపట్టారు. జిల్లా రైతులు పండించిన 'మసూరి'కు గిట్టుబాటు ధర లేదని, సెజ్‌ల పేరుతో భారీగా అవినీతి జరిగిందని, సోమశిల నీటిని అక్రమంగా కడ పకు తరలింపు వంటి అంశాలపై సమీక్ష జరిపే తీరిక ముఖ్యమంత్రికి లేదని విమర్శించారు. నెల్లూరులోని మూడు కాంగ్రెస్ గ్రూపుల నాయకుల ఇళ్లలో టిఫిన్, టీ, మధ్యాహ్న భోజనం, రాత్రికి డిన్నర్ చేయను రోశయ్య ఇంత ప్రజాధనం ఖర్చుచేసి నెల్లూరుకు రావాల్సిన అవసరమే లేదని చంద్రమోహన్‌రెడ్డి ముక్తాయించారు.

### అందమైన అబద్ధం



చిత్ర విచిత్రమైన వేషాలు, హావభావాలతో కూడిన మాటలతో మొత్తం మీద ప్రజాపథం కార్యక్రమాన్ని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 'రక్తి' కట్టించారు. ఆయన రూరల్ ఎమ్మెల్యే అయినా, శివారు ప్రాంతాల్లో తిరగక నగరంలోనే ఎక్కువగా పర్యటించారు. నగరంలో అభివృద్ధి పరవళ్లు తొక్కుతుందని గత ఐదేళ్లుగా నెల్లూరులో జరిగిన అభివృద్ధి రాష్ట్రంలో మరెక్కడా జరగలేదని అందమైన అబద్ధం చెప్పారు. నిజంగా అంత అభివృద్ధి జరిగి వుంటే నగరంలో రోడ్లు ఎందుకు దిగేడుస్తుంటాయి? డ్రైనేజీలు మురికి నీటితో ఎందుకు పొంగి పొర్లుతాయి?? వీధి దీపాలు ఎందుకు వెలగవు??? మంచి నీళ్లకు ఈ కటకట ఏమిటి స్వామి!



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

ఉత్సాహం, సుఖసంతోషాలు అధికంగా అనుభూతిలోకి వస్తాయి. ఇంటికి కావలసిన వస్తువుల్ని ఏర్పరుచుకోవడంలో నిమగ్నులౌతారు. ఉద్యోగ స్థానాల్లో మీ పలుకుబడి పెరిగి తృప్తినిస్తుంది. ఆకస్మిక పరిణామాలు ఏర్పడతాయి. శ్రమ, అలసట తప్పదు. వారాంతంలో వృత్తిరీత్యా మీరుతీసుకొన్న నిర్ణయాల్లో హఠాత్పరిణామాలు చోటు చేసుకొంటాయి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఇతరులకు మేలైన సాయాన్నందిస్తారు. మొదలు పెట్టిన పనులను చివరి వరకు చేయడానికి స్నేహితులు చేయూతనిస్తారు. వృత్తిరీత్యా చక్కని ఫలితాలుంటాయి. ఆశ్చర్యపడేరీతిలో ప్రియవార్తాశ్రవణం చేస్తారు. చుట్టుపక్కలవారు, సన్నిహితులు పొగిడేరీతిలో పనులు చేస్తారు. కుటుంబసభ్యుల నడుమ ప్రతిష్ఠ పెరుగుతుంది. ఖర్చులు ఊహించినదానికంటే అధికంగా ఉంటాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా

ఆర్థికలావాదేవీలు సరియైన రీతిలో నిర్వహించి విజయం సాధిస్తారు. ఆగిపోయిన పనులను తిరిగి ఉత్సాహంతో పూర్తి చేస్తారు. కోరినవి కోరిన రీతిలో జరుపుకొంటారు. వృత్తి పురోభివృద్ధి విషయంలో అధికశ్రద్ధ చూపుతారు. నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది. వృత్తిరీత్యా కొత్తగా ఒప్పందాలు చేసుకొంటారు. ఉద్యోగులకు అధికారుల ఆదరణ ఉంటుంది.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

దైవపూజా కార్యక్రమాలతో మనశ్శాంతి లభిస్తుంది. చేతికందిందంతా పూర్తిగా ఖర్చు చేస్తారు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొని ఇబ్బందులు కొని తెచ్చుకోవద్దు. కళత్రసంబంధం కొంత వరకు మెరుగు. వ్యాపారాలలో వచ్చిన నష్టాలను ఒకవిధంగా పూడ్చుకొంటారు. బంధుమిత్రులు తమ వంతు సాయమందిస్తారు. అడ్డుతగిలి ఆగిపోయిన పనులు ఊపందుకొంటాయి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

ఆప్తమిత్రులద్వారా శుభవార్తాశ్రవణం. నియమనిష్ఠలతో నమ్మకంతో పూజాదులు నిర్వహిస్తారు. వివాహాది శుభకార్యచర్చలు చోటు చేసుకొంటాయి. దాంపత్య సుఖం అన్యోన్యత పెరుగుతుంది. విదేశీపర్యటనలు హాయిగా సాగుతాయి. జాగ్రత్తగా, ఓర్పుతో సదాలోచనతో అడుగు వేయాలి. ఒకవైపు నిదానం మరొకవైపు ఉత్సాహం చోటు చేసుకొంటుంది. పని నిర్వహణలో జాగ్రత్త అవసరం.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్త 1, 2 పా

ఇరుగుపొరుగువారితోసంబంధాలు చక్కగా ఉంటాయి. దొంగచాటు శత్రువులు దూరమవుతారు. వైద్యసంబంధిత ఖర్చులు తప్పవు. పొదుపు చేసుకొన్న డబ్బు కరిగిపోయే సమయం. పథకం ప్రకారం చేయదలచిన పనుల్లో ఆటంకాలు. వృత్తిరీత్యా అభివృద్ధికి గాను తోటివారి తోడ్పాటు బాగా లభిస్తుంది. కళత్ర సంబంధీకుల నుండి మంచి పరిణామాలు ఎదురు చూడవచ్చు.

# వారఫలాలు

*తేది 8-05-2010 నుండి 14-05-2010 వరకు మేషంలో రవి, బుధులు; వృషభంలో శుక్రుడు; మీనాల్లో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యల్లో శని; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; కుంభ, మీన, మేషాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

**శుభముహూర్తాలు లేవు.**

**మే తిథులు**

**అధిక వైశాఖ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 8 | శని | దశమి | తె.3.31 | గం.ల.వ |
| 9 | ఆది | ఏకాదశి | తె.5.16 | గం.ల.వ |
| 10 | సోమ | ద్వాదశి | పూర్తి | |
| 11 | మంగళ | ద్వాదశి | ఉ.6.25 | గం.ల.వ |
| 12 | బుధ | త్రయోదశి | ఉ.7.00 | గం.ల.వ |
| 13 | గురు | చతుర్దశి | ఉ.6.59 | గం.ల.వ |
| 14 | శుక్ర | అమావాస్య | ఉ.6.25 | గం.ల.వ |

**నిజ వైశాఖ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| పాడ్యమి | తె.5.24 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com



**తుల**
చిత్త 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా

మీ కార్యనిర్వహణ సామర్థ్యం బహిర్గతమవుతుంది. స్థిరాదాయానికి తగిన పథకాలు ఏర్పరుచుకొంటారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఫలవంతమవుతాయి. కుటుంబంలో సుఖ సంతోషాలు నెలకొంటాయి. ఎలాంటి సమస్యలనైనా ఉత్సాహంగా ఎదుర్కొంటారు. ఆధ్యాత్మికగురువులను కలుసుకొంటారు. నిరీక్షిస్తున్న డబ్బు చేతికందుతుంది. బాకీలు వసూలవుతాయి.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

నూతన వాహనప్రాప్తి లేదా వాహనరిపేర్లకు అవకాశాలున్నాయి. వృత్తి అభివృద్ధికి తోడ్పడే వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఉద్యోగరీత్యా ఎదురు చూసిన ఆర్థిక లాభాలు చేతికి అందివస్తాయి. ముఖ్యుల నుండి ప్రియవార్తాశ్రవణం. చుట్టుపక్కలవారితో, బయట ప్రపంచంతో సత్సంబంధాలుంటాయి. ఇల్లు, ప్లాటు మొదలైనవి కొనే ప్రయత్నాలు ఊపందుకొంటాయి.



**ధనస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

సోదరులు అన్నివిధాల చేయూతనిస్తారు. నూతనప్రయత్నాలలో అత్యధిక శ్రద్ధ చూపుతారు. పాత సమస్యలకు మంచిపరిష్కారం కనుగొంటారు. దగ్గరి ప్రయాణాలు లాభకరంగా ముగుస్తాయి. ప్రతి పని సులువుగా శ్రమలేకుండా చేసి ముగిస్తారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు కోరుకొన్న రీతిలో జరుగుతాయి. సంతానమూలంగా సుఖశాంతులుంటాయి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ట 1, 2 పా

గృహాలంకరణలో ఆసక్తి చూపుతారు. వృత్తిలో పదోన్నతికి అవకాశాలు మెండు. వేతనోన్నతికి కూడ. వివాహ ప్రయత్నాలు చక్కగా ఫలిస్తాయి. ప్రయాణాలు సుఖాంతమవుతాయి. ధనాదాయ ప్రాప్తిలో ఆటంకాలు తొలగుతాయి. ఆత్మవిశ్వాసం పెరిగి పనులు అత్యంత సులువుగా చేసుకపోతారు. సోదరులకుటుంబనికి సంబంధించి శుభవార్తాశ్రవణం ఉండవచ్చు.



**కుంభం**
ధనిష్ట 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ప్రతిపనిలో నిదానం అవసరం. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. మీ నిరీక్షణ ఫలించి ఎదురుచూసిన వ్యక్తితో సంభాషణ చేస్తారు. దూరప్రయాణాలు సత్ఫలితాలనిస్తాయి. ఆంత్ర బాధలుండవచ్చు. ధనవిషయంలో లోపం వుండదు. ఎదురుచూసిన రీతిలో ధనప్రాప్తి. ఆగిపోయిన పనుల్ని పూర్తిచేస్తారు. ఉద్యోగులకు పదోన్నతి అవకాశాలు. సోదరులతో సత్సంబంధాలు నెలకొంటాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఎదురుచూసిన బదిలీలు, మార్పులు చోటుచేసుకొంటాయి. నూతనవ్యక్తులతో మెలకువగా నడచుకోవాలి. అధికంగా ఖర్చు చేసినా తృప్తి ఉండకపోవచ్చు. దూరప్రయాణాలు నిరుపయోగాలు. వాయిదా పడ్డ పనులలో కొంత ముందంజ కానవస్తుంది. పైవారితో సత్సంబంధాలుంటాయి. నూతన ప్రయత్నాలు చక్కని ఫలితాలనిస్తాయి. వివాహాది ప్రయత్నాలు సుముఖంగా సాగుతాయి.

# క్షేత్రార్పణగల గృహాలు స్వర్గధామాలు!

*బి.విక్టర్ మోజెస్ — నెల్లూరు*

* *గృహాలు 'కళకళలాడాలంటే ఏవిధంగా వుండాలి?*

'ఇండియన్ వాస్తు అండ్‌సైంటిఫికల్ థియరీ' అనే పుస్తకంలో గృహాలు 'క్షేత్రార్పణం' కలిగి వుండాలని రచయిత చెప్పారు. ఈ విషయం 'విశ్వామిత్ర' వాస్తుశాస్త్రం నుంచి రచయిత గ్రహించారు. విస్తీర్ణం శేషంలో భోగం, ధృవపతి, ధనాఢ్యం వస్తే ఆ గృహం 'స్వర్గధామం'లా వుంటుంది.

*ఐ.శ్రీనివాసాచార్యులు — హైదరాబాద్*

* *వాస్తు యంత్రాలు, రత్నాలకు జీవిత కాలం ఎంత? అవి ఎంతకాలం ప్రభావం చూపిస్తాయి?*

శక్తిసమన్వితమైన యంత్రాలకు రెండేళ్ళు, రత్నాలకు ఎనిమిదేళ్ళ జీవితకాలం. ఆ పై అవి మార్చుకోవాలి.

*జె.వి.రాయుడు — చెన్నై*

* *పాత యిల్లు తాళం వేశాక చాలా సమస్యలు ఎదురయ్యాయి. ఇప్పుడు చేర్పులు మార్పులు చేశాక మంచి ఘటనలు జరుగుతున్నాయి.*

శక్తులు చేరినప్పటికి చేర్పులు మార్పుల వల్ల అవి ప్రక్కకు వెళతాయి. యంత్ర ప్రతిష్ఠ జరిగాకే మీరు నిశ్చింతగా వుండడానికి వీలవుతుంది.

*షేక్ ముంతాజ్‌బేగం — నెల్లూరు*

* *పరమేశ్వరి లేఅవుట్ (ఇరగాళమ్మ ఏరియా) ఏరియాలో మా యిళ్ల ప్రక్క నీటి నిల్వలున్నాయి. దోషమా?*

గృహ నిర్మాణాల సమయంలో వాస్తుదోషాలు లేకుండా చేసుకుని అవసరాన్ని బట్టి కూర్మ, మత్స్య యంత్ర ప్రతిష్ఠలు చేసుకోవాలి.

*వై.బాలకృష్ణారెడ్డి — గుంటూరు*

* *వీధి దక్షిణ నైరుతి నుంచి ప్రారంభమై తూర్పు వైపు మలుపు తిరిగి తిరిగి ఉత్తరం వాయవ్యం వైపు వెళుతుంది.*

ఈ ప్రాంతాలలో గృహ నిర్మాణం అరిష్టదాయకం. ఆరిపోయే దీపం ముందు పరిస్థితిలా అక్కడ వుంటుంది. వాస్తు యంత్రప్రతిష్ఠ కొంత మేలు చేస్తుంది.

*షేక్ ఖాదర్‌బాషా — నెల్లూరు*

* *జ్యోతిష్య శాస్త్రరీత్యా మంచి ప్లాట్లను ఎంపిక చేసుకుంటే మేలు జరుగుతుందా?*

పుట్టినతేది, నామ నక్షత్రం, తల్లితండ్రుల పేర్లను బేరీజువేసి సంబంధిత ప్లాటు కొనుగోలు చేస్తే అడ్డంకులు లేకుండా గృహనిర్మాణాలు పూర్తి అవుతాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.శివరామిరెడ్డి — నెల్లూరు*

* *ఇల్లు నిర్మాణం పూర్తి అయింది. అమ్మాయి వివాహం వైఫల్యం చెందింది?*

నిర్మాణ సమయంలో దిక్కులను సరిచేసుకోవలసింది. దక్షిణ దిశాదోషం బాగా వుంది. వాస్తు యంత్రం(ప్రథమార్ధ) వెంటనే ప్రతిష్ఠింపజేయండి.

*జడ్.క్రిష్టఫర్ — విజయవాడ*

* *అపార్టుమెంటులో ఫ్లాటు కొన్నాక పూజ చేసి చేరాము. పిల్లవాడి ఆరోగ్యం పాడయింది.*

అపార్టుమెంట్లంటేనే వాస్తులేని అగ్గిపెట్టె గృహాలని అర్థం. చేరే ముందు గుమ్మడి, టెంకాయలు, నిమ్మకాయలు బలి ఇవ్వాలి. అలా చేయకపోతే ఎవరో ఒకరు అనారోగ్యానికి గురవుతారు.

*డి.గిరిజాకళ్యాణ్ — కావలి*

* *వీధి చూపులు మంచివని, పోట్లు చెడ్డవని అంటారు నిజమేనా?*

మంచి చెడులు ఆయా కోణాల్ని బట్టి వుంటాయి. అయితే రెండింటి వల్లా దృష్టిదోషం వుంటుంది. అది కోణాల్ని బట్టి హెచ్చుతగ్గుల్ని కలిగి వుంటుంది.

*డాక్టర్ సూర్యనారాయణ — సనత్‌నగర్*

* *ఇంటి స్థలం ఈశాన్యంలో కారు పార్కింగ్ పెట్టుకోవచ్చా?*

ఈశాన్యంలో షెడ్డు, కారు పార్కింగ్ కూడదు.

# ఆత్మకూరు పంచాయితీలో అధ్వాన్న పరిస్థితి!

అసెంబ్లీ నియోజకవర్గ కేంద్రంగా వున్న ఆత్మకూరు పట్టణం చాలా అధ్వాన్నంగా వుంది. మేజర్ గ్రామ పంచాయితీగా నమోదు కాబడినప్పటికి అభివృద్ధి విషయంలో బాగా వెనుకబడి పోయింది. త్రాగు నీటి సరఫరా, వీధిలైట్లు, పారిశుద్ధ్యం, అంతర్గతరోడ్లు తదితర సమస్యలు ఈ పంచాయితీని పట్టిపీడిస్తున్నాయి. గ్రామపంచాయితీకి పన్నుల రూపంలోనూ, వివిధ గ్రాంట్ల ద్వారా నిధులు సమకూరుతున్నా అభివృద్ధి పనులు మాత్రం జరగడం లేదు.

ఈ గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా కాంగ్రెస్ పార్టీకి చెందిన బొమ్మిరెడ్డి రవీంద్రనాథ్‌రెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. పంచాయితీ పరిధిలోని ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలు చాలా దుర్భరంగా వున్నాయి. డ్రైనేజి కాల్వల నిర్మాణం చేపట్టకపోవడం కారణంగా మురికి నీరంతా వీధులలో చేరి దుర్వాసన వస్తుంది. అలాగే వీధులలో పోసిన చెత్తా, చెదారాన్ని పంచాయితీ సిబ్బంది ఎప్పటికప్పుడు తొలగించకపోవడం వలన కుక్కలు, పందులు చేరి స్వైరవిహారం చేస్తున్నాయి. కుక్కలు, పందులు ఇంటి పరిసరాల్లో మురికితో తిరుగుతున్నందున ఎక్కడ అంటువ్యాధులు వ్యాపిస్తాయోనని స్థానికులు భయపడుతున్నారు.



**పారిశుద్ధ్యం అధ్వాన్నం!**

పంచాయితీ పరిధిలో పారిశుద్ధ్యం చాలా అధ్వాన్నంగా వుంది. వీధి లైట్లు కూడా సక్రమంగా రాత్రిపూట వెలగడం లేదు. పంచాయితీ సిబ్బందికి అనేక దఫాలు విన్నవించుకున్నా ఎవరూ పట్టించుకోలేదు. ఇప్పటికైనా జిల్లా పంచాయితీ అధికారులు స్పందించి అభివృద్ధి పనులు చేపట్టాలి.

– బత్తల సుబ్బయ్య



**రోడ్లు నిర్మించాలి!**

గ్రామ పంచాయితీ పరిధిలోని ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలలో అంతర్గత రోడ్లులేక చాలా ఇబ్బంది పడుతున్నాం. అలాగే త్రాగునీటి సరఫరా కూడా రెండు రోజులకోసారి జరుగుతుంది. వేసవికాలం కావడం వలన ఇబ్బందికరంగా వుంటుంది. అధికారులు గ్రామంలో రోడ్ల నిర్మాణానికి చర్యలు తీసుకోవాలి.

– డి.పెంచలయ్య

పంచాయితీకి ఎస్.ఎఫ్.సి, 12వ ఆర్థిక సంఘం నిధులు అందుతున్నా వీటిని అభివృద్ధి పనులకు ఖర్చు చేయడంలో పంచాయితీ పాలకవర్గం విఫలమవుతుంది. సర్పంచ్‌గా ఎన్నికైన రవీంద్రనాథ్‌రెడ్డి రాజకీయ కుటుంబం నుంచి వచ్చినప్పటికి పంచాయితీ విషయంలో పారదర్శకంగా వ్యవహరించ లేకపోతున్నాడు. దీనిని ఆసరాగా చేసుకున్న కార్యాలయ సిబ్బంది పారిశుద్ధ్యం, డ్రైనేజిల గురించి పట్టించుకోవడం పూర్తిగా మానేశారు. స్థానిక ప్రజలు ఏదైన సమస్య గురించి మాట్లాడాలంటే సర్పంచ్ నివాసానికి వెళ్లాల్సి వుంటుందని అంటున్నారు. పాలకవర్గం సమావేశానికి మినహా మిగిలిన సమయంలో కార్యాలయానికి వెళ్లరని చెబుతున్నారు.

పెన్షన్లు, ఇందిరమ్మ గృహాల బిల్లులు చెల్లింపుల్లో నిర్లక్ష్యం జరుగుతుంది. పంచాయితీ కార్యదర్శి సైతం ఏదో ఒక పని పేరుతో బయట తిరుగుతుంటారు. సర్పంచ్, సిబ్బంది అందుబాటులో వుండకపోవడంతో ప్రజలు పలు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఈ నేపథ్యంలో పంచాయితీలోని సమస్యలపై స్థానికులు వెల్లడించిన అభిప్రాయాలను ప్రక్కన ఇస్తున్నాం.



మంచినీటిబోరు వద్ద పేరుకొన్న మురికి.



బస్టాండ్ సెంటర్‌లో పందుల స్వైరవిహారం.

అవినీతి కథ

# పనుల కాంట్రాక్టులన్నీ స్వపక్షానికే!

**నెల్లూరు నగరపాలక సంస్థకు విడుదలవుతున్న నిధులతో చేపట్టే పనుల కాంట్రాక్టులన్నీ అధికారపక్ష కార్పొరేటర్లు బినామీపేర్లతో చేసుకొంటూ లక్షలు గడిస్తున్నారు.**



తీరుమారని నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయం.

నెల్లూరు నగర పాలక సంస్థ పాలకవర్గం నగరంలో చేపడుతున్న వివిధ అభివృద్ధి పనుల విషయంలో పక్షపాత ధోరణి అవలంభిస్తుంది. సాధారణ నిధులతో చేపట్టే పనులలో అధికార పక్షం కార్పొరేటర్లు సూచించిన పనులకే మంజూరు చేస్తూ వస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం నుంచి వివిధ గ్రాంట్ల ద్వారా విడుదలవుతున్న నిధులు కూడా తమకు కావలసిన కార్పొరేటర్లు, డివిజన్‌లకే వెళ్తున్నాయి. మిగిలిన ప్రతిపక్ష కార్పొరేటర్ల డివిజన్‌లలో రోడ్లు మరీ అధ్వాన్నంగా వున్నా కూడా వాటి గురించి పట్టించుకోవడం లేదు.

ప్రభుత్వం నుండి గ్రాంటు విడుదల కాబోతున్న విషయాన్ని ముందుగా పాలకవర్గం లేదా స్టాండింగ్ కమిటీ సమావేశంలో వెల్లడించి సభ్యుల అభిప్రాయాలు తీసుకోవాలి. నెల్లూరు నగరంలో ప్రతి డివిజన్‌ను పరిగణలోనికి తీసుకుని నడిచేందుకు ఇబ్బందికరంగా వున్న రోడ్లను గుర్తించి వీటిని సిమెంటు రోడ్లుగా నిర్మించాల్సి వుంది. మునిసిపల్ కార్పొరేషన్ మేయర్ కేవలం కొంతమంది అధికారపక్షానికి చెందిన కార్పొరేటర్లకు మాత్రమే నిధులు విడుదలవుతున్న సమాచారం అందించి వారు సూచించిన రోడ్లకు ప్రతిపాదనలు పంపుతున్నారు.

రోడ్ల నిర్మాణం కోసం నిధులు విడుదలైన తర్వాతనే ఈ సమాచారాన్ని కౌన్సిల్ సమావేశంలో అజెండాలో పొందుపరచడంతో సభ్యులు ఆశ్చర్యపోక తప్పడం లేదు. ఇటువంటి సమాచారాన్ని ముందుగా సమావేశంలో ఎందుకు వెల్లడించలేక పోతున్నారని ప్రతిపక్ష సభ్యులు అధ్యక్ష స్థానంలో వున్న మేయర్‌ను పలుమార్లు నిలదీసి ప్రశ్నించినా ఆమె ఏమాత్రం ఖాతరు చేయకపోగా నా ఇష్టం వచ్చినట్లుగా వ్యవహరిస్తాను. మీకు చేతనయ్యింది చేసుకోండని సమాధానం చెబుతుంది. నిబంధనలకు విరుద్ధంగా సమావేశాలు నిర్వహించడంపై కూడా ఇదివరకే సభ్యులు ప్రశ్నించినా కూడా మార్పు కానరాలేదు.

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌కు 18 కోట్ల రూపాయలు మంజూరు చేయడం జరిగింది. ఈ నిధులతో గత సంవత్సరం అక్టోబర్ నెలలో కురిసిన భారీవర్షాల కారణంగా దెబ్బతిన్న రోడ్లు, కాల్వలు నిర్మించాల్సి వుంది. మునిసిపల్ కార్పొరేషన్ ఇంజినీరింగ్ విభాగం అధికారులు తొమ్మిది పనులకు 18 కోట్ల రూపాయలను ఖర్చుచేసే విధంగా ప్రతిపాదనలు పంపి ఆమోదం పొందడం వివాదాస్పదంగా మారింది. ఐదవ నంబర్ జాతీయ రహదారి నుంచి పడారుపల్లి మెయిన్ రోడ్డు వరకు తారు రోడ్డు నిర్మాణానికి కోటి 18 లక్షలు, మినిబైపాస్ నుండి చిల్డ్రన్స్ పార్కు మీదుగా సిమెంటు రోడ్డు నిర్మాణం కోసం ఏడు కోట్లు ఖర్చు చేస్తారు. మైపాడు గేటు సమీపంలో వున్న రైస్‌మిల్లుల మీదుగా జాతీయ రహదారికి వెళ్లే రోడ్డు నిర్మాణం కోసం రెండు కోట్ల 17 లక్షల రూపాయలు కేటాయించారు. బాలాజీనగర్ పుట్టవీధి మీదుగా జాతీయ రహదారికి వెళ్లే రోడ్డుకు రెండు కోట్ల 16 లక్షల రూపాయలు ఖర్చు చేయనున్నారు. ఈ పనులన్నీ కూడా బినామీ పేర్లతో అధికార పక్షానికి చెందిన కార్పొరేటర్లు చేపట్టేందుకు పైరవీలు చేసుకుంటున్నారు.

ఇదిలా ఉండగా నగరంలో పది మునిసిపల్ డివిజన్లలో సిల్ట్ తీసేందుకు దాదాపు ఏడు కోట్ల యాభై లక్షల రూపాయలు ఖర్చు చేశారు. ఇందుకు కౌన్సిల్ ఆమోదం లేకుండానే మేయర్ ముందస్తు అనుమతి ఇవ్వడం జరిగింది. ఈ పనులు కూడా కొందరు కార్పొరేటర్లే చేపట్టారు. కోట్ల రూపాయల కార్పొరేషన్ నిధుల్ని కౌన్సిల్ ఆమోదం లేకుండానే ఖర్చు చేస్తున్నారు. అధికారం చేతుల్లో వుందన్న భావంతో ఇష్టానుసారంగా ప్రవర్తిస్తున్నారు. నిబంధనలకు విరుద్ధంగా ఆమోదాలు పొందుతున్నా అధికారులు అభ్యంతరాలు చెప్పేందుకు జంకుతున్నారు. ప్రభుత్వం నుంచి వచ్చిన నిధులు అయిన వారికే దక్కడం విశేషం.



# చూడడం మానేస్తున్నారా?



బాలీవుడ్ హీరోయిన్ తనుశ్రీదత్తా అంటేనే వివాదాలపుట్ట అంటూ ఇటు పత్రికలు అటు చిత్రపరిశ్రమ తెగ గోలెట్టేస్తుంది. ఈ విషయమై ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను పలుకరిస్తే సినిమా స్క్రిప్టులో ముద్దులుంటే ఇవ్వక తప్పదు కదా? దాన్ని తప్పుపడితే ఎలానంటుంది. స్టయిలిష్‌గా వుండటానికి కాస్ట్యూమ్స్ విషయంలో కాస్త పొదుపు పాటిస్తాను. అయినా అరకొర కాస్ట్యూమ్స్‌లో వున్నానని చూడడం మానేస్తున్నారా అంది. పరిశ్రమలో నిలదొక్కుకోవాలంటే పొదుపుగా దుస్తులు ధరించక తప్పదంటుంది.



# డ్యాన్స్ అకాడమి పెడతా!

నృత్యమంటే తనకెంతో ఇష్టముంటుంది హీరోయిన్ శ్రియ. పూర్తి స్థాయిలో డ్యాన్స్‌కు ప్రాధాన్యమున్న సినిమాలో నటించాలనేది తన కోరికంటుంది. కానీ అది ఇప్పటికీ నెరవేరలేదు. అడపాదడపా సినిమాల్లో కొన్ని పాటల్లో నృత్యానికి ప్రాధాన్యం వుంటున్నా నృత్య నేపథ్యంలో తెరకెక్కే సినిమా కోసం ఎదురు చూస్తున్నానంటుంది. శాస్త్రీయ నృత్యంలో తనకున్న ప్రావీణ్యాన్ని అప్పుడప్పుడు సినిమాలలో ప్రదర్శిస్తూనే వున్నానని, వేదికపై ప్రదర్శనలు ఇస్తున్నానంటుంది. శాస్త్రీయ నృత్యంపై యువతలో ఆసక్తిని పెంచేందుకు ఓ అకాడమిని ఏర్పాటు చేస్తానంటుంది. దీనికంటే ముందు డ్యాన్స్‌కు ప్రాధాన్యమున్న సినిమాను స్వీయ నిర్మాణంలో తీస్తానంటుంది.

# తప్పటడుగు వేశాను!



దేశముదురు, కంత్రీ, మస్కా చిత్రాలు బాగా ఆడినా తన చేతిలో చిత్రాలు లేకపోవడానికి జయీభవ, సీతారాముల కళ్యాణం లంకలో చిత్రాల్లో నటించడమే కారణమని భావిస్తుంది హీరోయిన్ హన్సిక. ఈ విషయమై మాట్లాడుతూ తొందరపడి తప్పటడుగు వేశాను. అయినా జస్ట్ నా వయసు ఇంకా పద్దెనిమిదేళ్లే. సినిమాల్లో ఇంకా బోలెడంత కెరీర్ వుంది. ఇక నుంచి ఆచితూచి అడుగులు వేస్తానంది. అన్నట్లు హన్సిక ఇటీవల హాట్‌హాట్‌గా ఓ ఫోటో సెషన్‌కు ఫోజులిచ్చింది. ఏదైనా సినిమా కోసం అవసరమైతే లిప్‌కిస్ కూడా ఇస్తానంటుంది. కానీ హన్సికను వుపయోగించుకొనే నిర్మాతలే లేరు.

# సంతృప్తిగా వున్నా!



వినసొంపైన గాత్రం, చూడచక్కని రూపం హీరోయిన్ మమతా మోహన్‌దాస్ సొంతం. ఆమెను నటిగా మీ ప్రస్థానం ఎలా సాగుతుందంటే క్షణం తీరిక లేకుండా తెలుగు, తమిళ, మళయాళ భాషల్లో నటిగా నాకంటూ ఓ స్థానం వుంది. తెలుగులో వెంకటేష్, ఎన్టీఆర్, జగపతిబాబు, నితిన్, విష్ణు నాకెంతో ఇష్టమైన హీరోలు. నాగార్జున గారి సరసన రెండు చిత్రాల్లో నటించాను. మళయాళంలో అగ్రహీరోలందరి సరసన నటించాను. అవకాశం దొరికినప్పుడు పాటలు పాడుతున్నాను. నేను ఎంపిక చేసుకొన్న రెండు రంగాల్లోనూ సంతృప్తిగా వున్నానంది ఈ సుందరి.

# అతివలు మెచ్చిన అందగత్తె!



తన అందాన్ని ఆడవాళ్లు సైతం మెచ్చుకొన్నారంటుంది నిరంతరం వార్తల్లో వుండే హీరోయిన్ సమీరా రెడ్డి. ఈ విషయమై మాట్లాడుతూ సెక్సీగా వుంటాననే కామెంటుకు నేను ఫీల్ కాను. సెక్సీగా కనిపించడం తప్పుకాదు. అలాగని సెక్సీ అప్పీల్‌తోనే పరిశ్రమలో మనుగడ సాగించడం లేదంది. పబ్బుల్లో పలువురు యువతులు మీరు చాలా అందంగా వుంటారని మెచ్చుకొంటుంటారు. కొందరు నాపై చేయివేసి ఏమిటీ మేని ఛాయకు కారణమంటూ కూడా అడుగుతుంటారు. నేను చాలా స్వాభిమానిని. ఎవరితో ఎలా సంబంధాలు నెరపాలో బాగా తెలుసంటుంది సమీరారెడ్డి. ప్రస్తుతం మళయాళ, తమిళ భాషా చిత్రాల్లో నటిస్తున్న సమీరా అవకాశాలు వస్తే తెలుగులోనూ నటిస్తానంటుంది.

# బురిడి చేయలేదు!



✍ అల్లూరు రహీం

జంధ్యాల తర్వాత హాస్య చిత్రాలను జనరంజకంగా తీయగల దర్శకునిగా ఈ తరంలో ఇవివి సత్యనారాయణ పేరుగాంచాడు. ఆయనను దర్శకునిగా పెట్టి 'బిగ్ బి' ప్రొడక్షన్స్ తీసిన చిత్రమే బురిడి. చిత్రం పేరు ఆకర్షణీయంగా వున్నా వెండితెరపై చిత్రం చూస్తున్న ప్రేక్షకులను 'బురిడి' చేయలేకపోయారు. పైపెచ్చు ఇది ఇవివి దర్శకత్వం వహించిన 50వ చిత్రం కూడా. ఈ చిత్రంలో సందేశాలు, సమస్యలు, కన్నీళ్లు, రక్తపాతాలు కనపడవు. నవ్వించడమే పరమార్థంగా పదమూడు విచిత్రమైన జంటలు థాయ్‌లాండ్‌లోని హనీమూన్ హోటల్‌కు హనీమూన్ కోసం చేరుకొంటాయి. అదే హోటల్‌కు ఒక అమ్మాయిని చంపను ఆంధ్రా లాడెన్ ఇండియా నుంచి వస్తాడు. అక్కడ నుంచి కథ చిత్రవిచిత్రమైన మలుపులు తిరుగుతుంది. కానీ ఈ మలుపులు ముచ్చటగా కుదరలేదు. ఈ చిత్రంలో ఇవివి పెద్ద కుమారుడు ఆర్యన్ రాజేష్‌ను హీరోగా పెట్టారు. కళా కాంతిలేని ముఖం, తరచూ ఆయనే తెరపై కనిపించడం పాటలు పాడడం, ఫైట్లు చేయడానికే పరిమితమయ్యాడు తప్ప కథలో కథానాయకునిగా భాసిల్లలేక పోయాడు. చిత్రపరిశ్రమలోని 30 మంది హాస్యనటులు ఈ చిత్రంలో వున్నారు. జయప్రకాష్‌రెడ్డి – శకుంతల ద్విపాత్రాభినయం ఎపిసోడ్‌లో వారి ప్రేమ, పెళ్లి విఫలమయ్యే అంశాలు జనాన్ని నవ్విస్తాయి. అలీ ఓ టివీలో ప్రసారమయ్యే 'అదృష్టం' కార్యక్రమాన్ని అనుకరిస్తూ చేసిన 'దురదృష్టం'ను రక్తి కట్టించలేక పోయాడు. క్లైమాక్స్‌లో పదమూడు నిమిషాల పాటు నడిచే పేరడీ పాట మినహా ఆర్యన్ రాజేష్ – ఐశ్వర్యలపై చిత్రీకరించిన తతిమా మూడు పాటల్లో పసలేదు. అయితే జనార్ధన మహర్షి వ్రాసిన మాటలు కొన్ని క్యాచిగా వున్నాయి. సింగిల్ టీ కాదు... ఎంగిలి టీ కూడా ఇవ్వను. తొక్కలో టీ కోసం బొక్కలోకి ఎవరు వెళ్తారు. డ్యూటీ ఫస్ట్ బ్యూటీ నెక్స్ట్. పొట్ట పెరిగితే కొవ్వు అనుకొన్నాం... కానీ లవ్వు అనుకోలేదు. ఉగ్గు పోసిన దానిని పెగ్గుపోయలేనా? ఆంధ్రాలో ముసలివాళ్లను నమ్మడం మానేశారు ఈ కోవలోనివే. థాయ్‌లాండ్, పుకెట్ ఐలాండ్ అందాలను వి.శ్రీనివాసరెడ్డి కెమెరా ఎంత శ్రమించి చూపినా ప్రయోజనం లేకపోయింది.

ఇక చిత్రకథలోనికి వెళ్తే థాయ్‌లాండ్‌లో హనీమూన్ హోటల్‌ను నిర్వహిస్తుంటాడు ఏవిఎస్. ఆయన కుమారుడే ఆర్యన్(ఆర్యన్ రాజేష్). హైదరాబాద్‌లో డాన్ ఆంధ్రా లాడెన్(ఎమ్మెస్‌నారాయణ)ను థాయ్‌లాండ్‌లో వున్న ఐశ్వర్య(ఐశ్వర్య)ను చంపమని మాస్క్‌తో వచ్చిన వ్యక్తి 25 లక్షలు ఇస్తాడు. దీంతో ఆంధ్రా లాడెన్ తన శిష్యుడు రఘు(రఘుబాబు)తో కలసి అక్కడకు వెళ్తాడు. ఇంతలో ఐశ్వర్య తల్లి(కోవై సరళ) తన కుమార్తెను హనీమూన్ హోటల్‌లో రూమ్ మారమని ఫోన్‌చేసి చెబుతుంది. అపరిచిత వ్యక్తి ఐశ్వర్యను చంపమని ఇచ్చిన రూమ్ నెంబర్ చీటిపై పిట్ట రెట్ట వేయడంతో ఆంధ్రా లాడెన్, ఆయన శిష్యునికి కష్టాలు మొదలవుతాయి. ఆంధ్రా లాడెన్ దిగిన హనీమూన్ హోటల్‌లోనే జయప్రకాష్‌రెడ్డి – శకుం తల, అలీ – జ్యోత్స్న, ఎల్బీ శ్రీరాం – సురేఖావాణి, కృష్ణభగవాన్ – కల్పన, జీవా – సన, సుమన్‌శెట్టి – హేమ, తిరుపతి ప్రకాష్ – గీతాసింగ్‌ల జంటలు దిగి వుంటాయి. వీరంతా సక్రమ జంటలు కారు. ఆంధ్రా లాడెన్, రఘులు ఈ జంటల్లో ఎవరో ఒక మహిళను తాము చంపాలని, ఆ మహిళను తెలుసుకోను నానాపాట్లు పడుతుంటారు. హోటల్ అధినేత ఏవిఎస్‌కు మాత్రం తాము సినిమా కథను సమకూర్చుకోను థాయ్‌లాండ్ వచ్చామటారు. దీంతో ఏవిఎస్ తన కుమారుడు ఆర్యన్‌ను హీరోను చేయమని వారి వెనుకపడతాడు. హోటల్‌లోనే వుండే ఐశ్వర్య ఆర్యన్‌తో ప్రేమలో పడి డ్యూయెట్లు పాడే వరకు వెళ్తుంది. ఆంధ్రా లాడెన్, రఘు హోటల్‌లోని జంటల మధ్య మంట పెడతారు. వారంతా ఒకర్ని మరొకరు విమర్శించుకొంటూ రచ్చకెక్కి పేరడీ గీతాలు పాడుతారు. చివరన అసలు విలన్(బ్రహ్మానందం) ఇండియా నుంచి థాయ్‌లాండ్‌కు వస్తాడు. ఐశ్వర్యను చంపమని రౌడీలను పురమాయిస్తాడు. హీరో వారితో పోరాడి మట్టికరిస్తాడు. ఐశ్వర్య పేరిట తన రెండో భార్య కోవై సరళ ఆస్తి రాయడం వల్లే ఈ అఘాయిత్యానికి ఒడిగట్టినట్లు బ్రహ్మానందం చెప్పడంతో అందరూ అతనికి బడితపూజ చేస్తారు.




కార్పొరేషన్‌లోని వాటర్ వర్క్స్ విభాగం.

## నీటి సరఫరా విభాగంలో సిబ్బంది కొరత

అసలే నీటి ఎద్దడిని ఎదుర్కొంటున్న నగరవాసులకు మంచినీటి సరఫరా విభాగంలో సిబ్బంది కొరత మరింతగా అవస్థలు కలుగజేస్తుంది. కొళాయిల్లో నీటి సరఫరా సక్రమంగా జరుగక పలు ప్రాంతాల ప్రజలు నానాపాట్లు పడుతున్నారు. ఒక రోజు వస్తే మరొక రోజు నీళ్ల రాక దాహార్తిని తీర్చుకొనేందుకు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. నగరంలో మొత్తం 23 ఓవర్ హెడ్ ట్యాంకులున్నాయి. మహబూబ్‌ఖాన్ పార్కు, పొదలకూరురోడ్డు, మాగుంట లేఅవుట్, జెండావీధి, గాంధీనగర్, ఎసినగర్, తోటబడి, ఆదిత్యనగర్, ఫత్తేఖాన్‌పేట, మూలాపేట తదితర ప్రాంతాలలో ట్యాంకులతోపాటు, మునిసిపల్ కార్యలయంలోని నాలుగు ట్యాంకుల నుంచి నగరంలో వివిధ ప్రాంతాలకు నీటి సరఫరా అవుతుంది. ఈ విభాగంలో ప్రస్తుతం 224 మంది పనిచేస్తున్నా నగర జనాభా, నీటి సరఫరాకు తగినంత సిబ్బంది లేకపోవడంతో దాని ప్రభావం ప్రజలపై పడుతుంది. వేసవిని దృష్టిలో వుంచుకొని ముఖ్యమైన విభాగంలో అవసరమైన సిబ్బందిని పెంచుకోవాల్సిన బాధ్యత కార్పొరేషన్ అధికారులపై ఎంతైనా వుంది.


పట్టీపట్టనట్టున్న ఎఫ్‌సిఐ అధికారులు.

## అమలుకాని గిట్టుబాటు ధర

జిల్లాలో రైతులు పండించిన వరి ధాన్యానికి గిట్టుబాటు ధర దక్కడం లేదు. నెల్లూరు మసూర(34449)రకం ధాన్యానికి నల్లమచ్చ వుందన్న కారణంతో కొనుగోలు చేసేందుకు వ్యాపారులు, రైస్‌మిల్లర్లు ముందుకు రావడం లేదు. ఈ విషయాన్ని రైతు సంఘం నాయకులు ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లి ధాన్యం కొనుగోలు చేయకుంటే రైతులు ఆర్థికంగా మరింత చితికిపోతారని వివరించారు. దీనిపై రాష్ట్ర ప్రభుత్వం స్పందించి నెల్లూరు మసూరకు సరైన గిట్టుబాటు ధర కల్పించేందుకు సమ్మతించింది. నెల్లూరుజిల్లాలో దాదాపు లక్షా 50 వేల ఎకరాలలో ఈ రకం పంట వేశారు. జిల్లా కలెక్టర్ ప్రభుత్వం నుంచి వచ్చిన ఉత్తర్వులు పరిశీలించి పుట్టి ధాన్యం ఎ గ్రేడ్ రకం తొమ్మిది వేలు, నాణ్యతా ప్రమాణాలకు సరిపడా వుంటే ఎనిమిది వేల రూపాయలు చెల్లించాలని జిల్లా కలెక్టర్ ప్రకటించారు. అధికారులు నిర్వహించిన సమావేశానికి హాజరైన రైస్ మిల్లర్ల అసోసియేషన్ ప్రతినిధులు కూడా అధికారులు నిర్ణయించిన ధరకే ధాన్యం కొనుగోలు చేసేందుకు అంగీకరించడం జరిగింది. అయితే అంగీకరించిన విధంగా ధాన్యం కొనుగోలు జరగడం లేదు. ఇప్పటికీ గ్రామీణ ప్రాంతాలలో ఈ రకం ధాన్యం పుట్టి 7,400 రూపాయలకే రైతులు విక్రయించుకోవాల్సిన పరిస్థితి వుంది. అధికారుల ఆదేశాలు ఎక్కడా అమలు కావడం లేదు.

## ఫ్లెక్సీలకు 30లక్షలు ఖర్చు!

**రోశయ్యకు ఇంత ఘనస్వాగతం ఎక్కడా లభించలేదనాలి**


విఆర్‌సి సెంటర్‌లో ఏర్పాటుచేసిన ఫ్లెక్సీలు.

తొలిసారి నెల్లూరు వచ్చిన ముఖ్యమంత్రి రోశయ్యకు కాంగ్రెస్‌లోని రెండు వర్గాల నాయకులు పోటాపోటీగా స్వాగతం పలికారు. నెల్లూరు రైల్వేస్టేషన్‌లో అర గంట ఆలస్యంగా సింహపురి ఎక్స్‌ప్రెస్ దిగిన ముఖ్యమంత్రికి ఆనం వర్గీయులతోపాటు రాజీవ్‌భవన్ వర్గీయులు పోటాపోటీగా స్వాగతం పలికి నలిపివేశారు. దీన్ని అదుపు చేయలేక పోలీసులు ఫోటోలు తీయను ముందుకు ఉరికిన ఈనాడు ఫోటోగ్రాఫర్‌పై చేయి చేసుకోవడంతో పెద్ద రచ్చ రేగింది. ముఖ్యమంత్రికి స్వాగతం పలుకుతూ రైల్వేస్టేషన్ దగ్గర నుంచి ఆయన బసచేసిన పినాకినీ అతిథిగృహం వరకు వందల సంఖ్యలో ఫ్లెక్సీబోర్డులు ఏర్పాటు చేశారు. రాజీవ్‌భవన్ నిర్వాహకులు పాత తరహాలో వందల సంఖ్యలో బ్యానర్లు కట్టారు. జాతిపిత మహాత్మాగాంధీ, అమరజీవి పొట్టిశ్రీరాములు మధ్యలో ముఖ్యమంత్రి రోశయ్య; రాహుల్‌గాంధీ, వైఎస్ జగన్మోహన్‌రెడ్డి మధ్యలో ముఖ్యమంత్రి రోశయ్య ఫ్లెక్సీలు జనాన్ని ఆకర్షించాయి. విఆర్‌సి సెంటర్‌లో రామనారాయణరెడ్డి, జయకుమార్‌రెడ్డి మధ్యలో రోశయ్య బొమ్మలతో ఏర్పాటుచేసిన కటౌట్ విలక్షణంగా కనపడింది. మొత్తం మీద ముఖ్యమంత్రి రాక సందర్భంగా నెల్లూరు నగరంలో ఏర్పాటుచేసిన ఫ్లెక్సీల కోసం 30 లక్షల రూపాయలు ఖర్చు చేసినట్లు అంచనా. ముఖ్యమంత్రిగా బాధ్యతలు తీసుకొన్న రోశయ్యకు ఇంతటి ఆడంబర స్వాగతం పలికిన ఘనత కూడా నెల్లూరుకే దక్కిందనాలి.

## త్వరలో జాబ్ మేళా

**జిల్లాకలెక్టర్‌కు వచ్చిన మంచి ఆలోచన**

జిల్లాలో నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు కల్పించేందుకు త్వరలో జాబ్ మేళా నిర్వహించాలని జిల్లా అధికారయంత్రాంగం నిర్ణయించింది. ఇప్పటికి జిల్లాలో ఏర్పాటుచేసి వున్న వివిధ పరిశ్రమలలో ఖాళీగా వున్న ఉద్యోగ వివరాలను సేకరించేపనిలో అధికారులు నిమగ్నమై వున్నారు. పరిశ్రమలలో ఖాళీగా వున్న ఉద్యోగాలకు ఎటువంటి అర్హతలు కలిగినవారు అవసరమో అటువంటి వృత్తిపమైన శిక్షణ కూడా ఏర్పాటు చేయనున్నారు. ఈ విషయమై జిల్లా పరిశ్రమల కేంద్రం అధికారులకు జిల్లా కలెక్టర్ ఉత్తర్వులు జారీ చేయడం జరిగింది. జిల్లాలో పరిశ్రమలు ఏర్పాటుచేసే క్రమంలో స్థానికులకే ఉద్యోగావకాశాలు కల్పిస్తామని ఆయా సంస్థల ప్రతినిధులు ప్రకటించి వున్నారు. అనంతరం ఇతర ప్రాంతాల వారినే వివిధ ఉద్యోగాల్లో నియమించుకోవడం జరిగింది. దీనిపై ఆందోళనలు, నిరసనలు కూడా జరిగాయి. పెరిగిపోతున్న నిరుద్యోగ సమస్యను కొంతమేరకైనా పరిష్కరించాలన్న సంకల్పంతో జిల్లా కలెక్టర్ పరిశ్రమలపై దృష్టి కేంద్రీకరించారు. అవసరమైన శిక్షణ కార్యక్రమాలు ఏర్పాటుచేసేందుకు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, ఎస్సీ, ఎస్టీ, బిసి కార్పొరేషన్‌లు నిధులు సమకూర్చుతాయి. జిల్లాలో పరిశ్రమలు స్థాపించి నాలుగు సంవత్సరాలు గడిచిన తర్వాతనైన ఉద్యోగాలపై అధికారులు దృష్టిసారించడం అభినందనీయం.

## సింహపురిలో సిఎం హల్‌చల్


తన నివాసానికి అల్పాహార విందుకు హాజరైన ముఖ్యమంత్రి రోశయ్యకు మల్లెపూల మాలతో స్వాగతం పలుకుతున్న జనార్దన్‌రెడ్డి.


ఒంగోలు ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డి ఇంటికి తేనీటి విందుకు విచ్చేసిన ముఖ్యమంత్రి.


సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి స్వగృహంలో ముఖ్యమంత్రికి సాదర స్వాగతం.

## ఆర్యవైశ్యులకు అవమానం!

**సిఎంను సన్మానించబోతే లాగిపడేసిన సెక్యూరిటీ**


సన్మానసభలో జ్యోతి ప్రజ్వలన చేస్తున్న సిఎం రోశయ్య.

తమ కులస్తుడు ముఖ్యమంత్రి అయ్యాడని నెల్లూరు పర్యటనకు వచ్చిన రోశయ్యకు వేమాలశెట్టి బావి సత్రం దగ్గర అర్బన్ ఆర్యవైశ్య సంఘం నేతృత్వంలో ఏర్పాటుచేసిన సన్మానసభలో ఆ సంఘం నేతలకు తీవ్ర అవమానం జరిగింది. సన్మానసభ ప్రాంగణంలో పెద్ద సంఖ్యలో ఆర్యవైశ్యులు లేకపోయినా రోశయ్యకు సన్మానం చేయను పలువురు వైశ్య ప్రముఖులు బారులు తీరారు. ఐదారు నిమిషాలు ఈ సన్మానాన్ని చేయించుకొన్న రోశయ్య వున్నట్లుండి ఆర్యవైశ్యులు సన్మానం చేస్తుండగానే వేదిక దిగనారంభించారు. ఈ సమయంలో ముఖ్యమంత్రి ప్రక్కనుండిన జిల్లా అర్బన్ ఆర్యవైశ్య సంఘం అధ్యక్షుడు శేగుషణ్ముగరావును సెక్యూరిటీ సిబ్బంది లాగిపడేశారు. మరికొంత మంది వైశ్య ప్రముఖులకు సైతం ఇటువంటి అవమానం ఎదురయ్యింది. అంతకు ముందు జరిగిన సభలో రాష్ట్ర ఆర్యవైశ్య సంఘం అధ్యక్షుడు ఇ.కోటేశ్వరరావు మాట్లాడుతూ సర్వోదయ కాలేజిని ఆర్యవైశ్యులకప్పగించాలన్నారు. వేమాలశెట్టి బావి సత్రానికి కమిటీ ఏర్పాటు చేయడం పట్ల హర్షం వ్యక్తం చేశారు. ముఖ్యమంత్రి రోశయ్య మాత్రం తన ఉపన్యాసంలో నెల్లూరు ఆర్యవైశ్యులలో వుండే విబేధాల వల్ల వాళ్ల ఆస్తులు వారికి అప్పగించలేకపోతున్నట్లు చెప్పుకొచ్చారు. ఎండోమెంట్ నేతృత్వంలో వున్న ఆర్యవైశ్యుల ఆస్తులను వారికే చెందేలా చర్యలు తీసుకొంటామన్నారు. తనకు ముఖ్యమంత్రి పదవి పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నానని, రాజశేఖర్‌రెడ్డి ప్రవేశపెట్టిన పథకాలు విజయవంతం చేయడం మినహా తన పేరిట మరే పథకం ప్రారంభించనని చెప్పారు. నెల్లూరులోని ఆర్యవైశ్యులు తనకు పేరుపేరున తెలుసన్నారు. ఇన్ని చెప్పినా ఆయన ఓ పది నిమిషాలు వుంటే సన్మాన కార్యక్రమం పరిపూర్ణమయ్యేది. చేసిన వారికి తృప్తయినా మిగిలేది.

## అధిష్టానానికి జగన్ సవాల్

మొదటి పేజీ కొరవ

తున్నారని వినికిడి. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మరణిం చిన తర్వాత తానుచేసిన ముఖ్యమంత్రిత్వ ప్రయ త్నాలనుద్దేశించి చులకనప్రాయ వ్యాఖ్యలు చేసిన హనుమంతరావును ఎట్టి పరిస్థితులలోనూ రాజ్య సభకు ఎంపిక చేయకూడదని పట్టుబడుతున్నాడు జగన్. కెవిపి రామచంద్ర రావు కూడా అందుకు సహకారం అందిస్తున్నాడు. ఒకే వ్యక్తికి మూడు సార్లు రాజ్యసభ టిక్కెట్ ఇచ్చిన సాదృశ్యం లేదనే వాదన తెరమీదకు తెస్తున్నారు వీరు. అయితే హనుమంతరావు సోనియా కుటుంబానికి అత్యంత సన్నిహితుడు. అందువల్ల ఆయనకు మళ్లీ ఎన్ని కయ్యే అవకాశాలు దండిగా వున్నాయి. ఒకవేళ సోనియాగాంధీ తన మాట విన్పించుకోకుండా విహెచ్‌ను పోటీకి నిలబెడితే, రాజ్యసభ ఎన్నికల రంగంలోకి 7వ అభ్యర్థిగా ఒక స్వతంత్రుడిని దిం చాలన్నది జగన్ వ్యూహం. తన అనుచరులైన ఎమ్మెల్యేల చేత ఆ 7వ అభ్యర్థిని గెలిపించి, అధి ష్టానానికి తానేంతో నిరూపించాలన్నది ఆయన ఆలోచన. దీన్ని తిరుగుబాటుగా భావించి, తన మాట ప్రకారం కాంగ్రెస్ అభ్యర్థికి బదులుగా స్వతంత్రుడికి ఓటు చేసిన ఎమ్మెల్యేల మీద చర్య తీసుకొన్నా కూడా జంక కూడదన్నది జగన్ మొండి పట్టుదల. కనీసం 30 మంది ఎమ్మెల్యేలు తాను చెప్తే పార్టీ ఆదేశాన్ని ధిక్కరించి ఓటు చేస్తారని జగన్ అంచనా. అంతమంది మీద చర్య తీసుకొంటే రోశయ్య ప్రభుత్వం మైనార్టీలో పడిపోతుంది. ఆ రిస్కుకు భయపడి అయినా అధిష్టానం మౌనంగా వుండిపోతుందని, దానితో తన బలంతో అధి ష్టానం మెడలు వంచిన వాడిగా తన ప్రతిష్ట పెరుగుతుందని జగన్ ఆశిస్తున్నాడు.

ఈ సంగతి తెలిసినందువల్ల కాబోలు, ముఖ్యమంత్రి రోశయ్య ఇప్పటి నుంచే రాజ్యసభ ఎన్నికలలో తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి ఆలో చన చేస్తున్నాడు. శాసనసభ కార్యదర్శి సదారాంకు ఫోన్‌చేసి, రాజ్యసభ ఎన్నికల తీరు, పార్టీని ధిక్క రించే వారిని అదుపు చేయగల్గిన మార్గాలు వంటి వాటి మీద సమాచారం సేకరించారట. చట్ట ప్రకారం ఎన్నికల ప్రక్రియ ఏ రీతిలో జరుగుతుందో వివరంగా అడిగి తెలుసుకొన్నాడట.

### ప్రజారాజ్యానికి ఎమ్మెల్సీ!

జగన్ వ్యూహాన్ని చిత్తు చేయడానికి ప్రజారాజ్యం పార్టీని మచ్చిక చేసుకోవాలని తల పెడుతున్నాడు ముఖ్యమంత్రి. వారికి 18 ఓట్లు న్నాయి. ఆ ఓట్లను కాంగ్రెస్ అభ్యర్థులకు కేటా యింప చేయగల్గితే, స్వతంత్ర అభ్యర్థి నిలబడే అవకాశం వుండదు. అయితే, తాము కాంగ్రెస్‌తో సహకరించాలంటే ఒక రాజ్యసభ స్థానం తమకు కేటాయించాలని కోరాడట చిరంజీవి. సి.రామ చంద్రయ్యకు కానీ, అల్లు అరవింద్‌కు కానీ ఇవ్వాలని అడిగాడట. టిటిడి ఛైర్మన్ ఆదికేశవులు నాయుడు ఆ రాయబారం నడిపాడు. అయితే రోశయ్య అందుకు ఒప్పుకోలేదు. రాజీ బేరంగా ప్రజారాజ్యం పార్టీకి ఒక ఎమ్మెల్సీ స్థానం కేటా యిస్తామని, రాజ్యసభలో మాత్రం తమకు సహక రించాలని ప్రతిపాదించాడట. దీనిపై ఇంకా చర్చలు నడుస్తున్నాయి.

## మీసాలు మెలేస్తున్నారు

మొదటి పేజీ కొరవ

త్రులందరూ మీసాలు మెలేస్తున్నారిప్పుడు. ముఖ్య మంత్రి అంటే లెక్కలేనట్లు ప్రవర్తిస్తున్నారు. తమ నేమీ చేయలేని సిఎంతో తమకేమి భయం అన్నట్లు నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారు. వీరిని దారికి తేవాలంటే మంత్రివర్గ ప్రక్షాళన ఒక్కటే మార్గం. కానీ సెప్టెం బర్‌లో మునిసిపల్ ఎన్నికల వరకు ఆయన ఆ ప్రసక్తి ఎత్తుకొనే సూచన కన్పించడం లేదు. రోజు లిట్లే గడిస్తే మాత్రం రోశయ్య ముఖ్యమంత్రిగా నామమాత్రమై పోవడం ఖాయం.

## వైద్య ఆరోగ్యశాఖ

5వ పేజీ కొరవ

చేపట్టాలన్న సంకల్పంతో ఒక్కో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి 30 నుంచి 50 వేల రూపాయల వరకు ప్రభుత్వం నిధులు విడుదల చేస్తుంది. ఈ నిధులను మండల పరిషత్ అధ్యక్షుల ఆధ్వర్యంలో సమావేశం నిర్వహించి ఖర్చు చేయాల్సి వుంటుంది. అయితే కొంతమంది వైద్యులు అసలు సమావేశాలే నిర్వ హించడం లేదు.

సమావేశాలు నిర్వహించకపోవడం, కేటా యించిన నిధుల్ని ఖర్చు చేయకపోవడం కారణంగా గ్రామీణ ప్రాంతాల్లో పారిశుద్ధ్యం అధ్వాన్నంగా వుంది. ఈ నిధులకు సంబంధించి కూడా పలు ఆరోపణలు వున్నాయి. నిధులు దుర్వినియోగానికి పాల్పడిన వారిపైన గాని, జిల్లాస్థాయి అధికారిపై దాడి చేసిన వారిపై గాని కఠిన చర్యలు లేకపో దంతో మిగిలిన సిబ్బంది కూడా మరిన్ని అక్రమా లకు పాల్పడే ఆస్కారం ఏర్పడింది.

## జనవాణి

2వ పేజీ కొరవ

మానవవనరుల మంత్రి తయారు చేసినట్లుగా లేదు. తలపండిన లాయరు తయారుచేసినట్లుంది. ఈ చట్టం ప్రైవేట్ వ్యక్తులు, విదేశీ విశ్వవిద్యాలయాలు, కార్పొరేట్ పాఠశాలల నిర్వాహకులకు అనుకూ లంగా వుంది. ఈ చట్టం వల్ల సామాన్యులకు కలిగే ప్రయోజనం శూన్యమే.

కె.వెంకటేశ్వరరావు, నెల్లూరు

### ఆకుకూరల కోసం అల్లాడవలసి వస్తోంది!

నెల్లూరు ఏసి కూరగాయల మార్కెట్ దగ్గర వున్న రోడ్డుమార్జిన్ వ్యాపారస్తులు తాజా కూరగా యలు, ఆకుకూరలు అమ్మేవారు. వీరిని కుంటి సాకులు చెప్పి ఫత్తేఖాన్‌పేట రైతుబజారుకు తర లించారు. దీనివల్ల తాజా కూరగాయలు, ఆకు కూరలు ప్రజలకు అందుబాటులో లేకుండా పోయాయి. ఏసి మార్కెట్‌లోని వ్యాపారులు చేసే మోసాలను అరికట్టే విషయంలో పౌరసరఫరాల శాఖాధికారులు, తూనికల కొలతల శాఖాధికారులు పూర్తిగా విఫలమయ్యారు. నెల్లూరు చుట్టుప్రక్కల రైతులు పండించిన కూరగాయలు అమ్ముకొనే ప్లాట్ ఫారాలుగా రైతుబజార్లు విఫలమయ్యాయి. ఈ విష యాన్ని ఉన్నతాధికారులు గమనిస్తే బాగుంటుంది.

చల్లా యానాదయ్య, నెల్లూరు



నెల్లూరు 23వ డివిజన్‌లో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించి సిడిని ఆవిష్కరిస్తున్న ముఖ్యమంత్రి కె.రోశయ్య. ప్రక్కన రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, కార్పొరేటర్ నరేంద్రరెడ్డి.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

పోయిన ముఖ్యమంత్రి వారిద్దరినీ నిలువరించారు. ముఖ్యమంత్రికి పనబాక దంపతులు రాధాకృష్ణుల ప్రతిమను కానుకగా ఇచ్చారు.

### సీనియర్ ఇంటర్‌లోనూ కృష్ణచైతన్య హవా!

ఇటీవల ప్రకటించిన ఇంటర్మీడియట్ ద్వితీయ సంవత్సరం ఫలితాల్లోనూ నెల్లూరు కృష్ణచైతన్య జూనియర్ కాలేజి విద్యార్థులు మార్కుల మోత మోగించారు. ఎమ్పీసి విభాగంలో ఎన్.విష్ణువర్ధన్ రెడ్డి వెయ్యి మార్కులకుగాను 987 మార్కులు సాధించి గత రికార్డులన్నీ బ్రేక్ చేశాడు. ఈ అబ్బా యికి మ్యాథ్స్‌లో మూడు వందల మార్కులకు గాను మూడు వందలు, ఫిజిక్స్‌లో 150, కెమిస్ట్రీలోనూ 150 మార్కులొచ్చాయి. ఇతను ఓ లారీ డ్రైవర్ కుమా రుడు కావడం విశేషం. ఇక్కడే చదివిన వై.సింధూజ 982, మౌనిక 979, వెంకటేష్ 978 మార్కులు సాధించినట్లు కాలేజి నిర్వాహకుడు చంద్రశేఖర్‌రెడ్డి చెప్పారు.

### రోశయ్యను నవ్వించిన జనార్దన్‌రెడ్డి!

నెల్లూరు వి.ఆర్.సి మైదానంలో జరిగిన భూ పంపిణీ సభలో మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ఉపన్యాసం ఆద్యంతం సభికులను ఆకర్షించింది. నెల్లూరు మాండలికంలో మాట్లాడిన జనార్దన్‌రెడ్డి ఉపన్యాసం ప్రారంభంలోనే రోశయ్య మన నెల్లూరుకు మేనమామ అనగానే సభికులు గలగల నవ్వారు. రోశయ్య దగ్గరకు ఏదైనా కాగితం తీసుకువెళ్తే అదిగో అలా ముక్కు మూతిపై వేలు పెట్టుకొని వుంటాడనే సరికి రోశయ్య కూడా నవ్వాపు కోలేకపోయారు. ఇక్కడే మేయర్ భానుశ్రీ, వివేకానందరెడ్డిని ఉద్దేశించి జనార్దన్‌రెడ్డి బహు నేర్పరి తనంతో చురకలంటించారు. వారు సైతం వీటిని నవ్వుతూనే స్వీకరించక తప్పలేదు.

### ఆత్మకూరు శైలజారెడ్డి వివరణ

ఆత్మకూరులోని సాయి రూరల్ వాలంటరీ ఆర్గనైజేషన్ నిర్వాహకురాలు పులిమి శైలజారెడ్డిపై మార్చి 26, ఏప్రిల్ 30వ తేదీలలో 'జమీన్‌రైతు' సంచికల్లో వచ్చిన వార్తలపై ఆమె వివరణ పం పారు. ఆత్మకూరులో అంతర్జాతీయ మహిళాదినో త్సవం జరపను తాను దండకాలు చేయలేదని, క్రమ శిక్షణకు మారుపేరైన బిజెపి పార్టీలో వివిధ హోదాల్లో పనిచేసి బయటకు వచ్చానన్నారు. ప్రస్తు తం కాంగ్రెస్‌లో ఎటువంటి హోదా లేకపోయినా కష్టపడి పనిచేస్తున్నానన్నారు.

### మీడియాపై ప్రతాపం

ముఖ్యమంత్రి రోశయ్య పర్యటనలో పోలీ సులు అత్యుత్సాహం ప్రదర్శించి మీడియాను అదు గడుగునా అడ్డుకొన్నారు. ముఖ్యమంత్రి పర్యటనల సమయంలో ప్రభుత్వ ఉద్యోగుల మాదిరి మీడి యాకు డ్యూటీపాస్‌లను పోలీసులు జారీ చేసే వారు. ఈసారి ఏం జరిగిందో ఏమో కేవలం విఆర్‌సి, వేమాలశెట్టి బావి సత్రం వద్దకు మాత్రమే వెళ్లేలా అడ్మిషన్ పాసులిచ్చారు. పత్రికకు కేవలం రెండేసి పాసులివ్వడం, ముఖ్యమంత్రి వెళ్లిన ప్రతి చోటకు మీడియాను పోలీసులు వెళ్లనీయక పోవ డం, రైల్వేస్టేషన్‌లో ఓ ఫోటోగ్రాఫర్‌ను ఎస్పీనే స్వయంగా లాగి పడేయడంతో మీడియా జనార్దన్ రెడ్డి ఇంటి వద్ద నిరసనకు దిగింది. జరిగిన పొర పాట్లకు కలెక్టర్ రాంగోపాల్ క్షమాపణ చెప్పడంతో మీడియా వెనక్కు తగ్గింది. ఈ రచ్చకు డిపిఆర్‌ఓనే కారణమని మీడియా ముఖ్యమంత్రి రోశయ్య దృష్టికి తీసుకవెళ్లింది.

### వివేకాపై తిరగబడ్డ నారాయణరెడ్డిపేట!

తమకు ఉత్తుత్తి ఇంటి స్థలాల పట్టాలివ్వ డంపై గతవారం నారాయణరెడ్డిపేటలోని జరిగిన ప్రజాపథం కార్యక్రమంలో రూరల్ ఎమ్మెల్యే వివేకా నందరెడ్డి గ్రామస్తులు నిలదీశారు. మాటిమాటికి పట్టాలివ్వడం కాదు. స్థలం చూపించమని చేనేత కార్మిక కుటుంబాలు నిలదీసేసరికి అందరినీ పెద్ద నోటితో దబాయించే వివేకా నోరు మూతబడింది.

### అంకయ్యగౌడ్‌కు అనారోగ్యం!

జిల్లాలో పేరుగాంచిన మద్యం వ్యాపారి, ఆ తర్వాత రాజకీయనాయకునిగా మారిన రావుల అంకయ్యగౌడ్ అనారోగ్యంతో బాధపడుతూ నెల్లూరు బొల్లినేని ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

# కసబ్‌ను బహిరంగంగా ఉరితీయాలి!

ముంబై నగరంలో మారణహోమానికి పాల్పడి 72 మందిని పాశవికంగా హత్యజేసిన పాకిస్తాన్‌కు చెందిన అజ్మల్ కసబ్‌ను ప్రత్యేక న్యాయస్థానం దోషిగా తేల్చింది. దాదాపు 18నెలలపాటు ప్రత్యేకంగా విచారణ జరిగిన ఈ కేసులో వందల మంది పైగా సాక్షులను విచారించడం జరిగింది. దేశంలో మారణకాండ సృష్టించాలన్న లక్ష్యంతో పాకిస్తాన్ నుంచి టెర్రరిస్టులు ముంబైకి వచ్చారు. ముంబై నగరంలోని ప్రధాన స్టార్ హోటళ్లలోకి జొరపడి విచక్షణారహితంగా కాల్పులు జరిపారు. మొత్తం 72 మందిని బలితీసుకోగా వీరిలో 14మంది పోలీసులున్నారు.

కసబ్‌ను దోషిగా నిర్ధారించిన తరుణంలో నిందితుడికి ఎటువంటి శిక్షపడుతుందన్న సందేహం దేశప్రజలలో నెలకొంది. దేశంలోకి అక్రమంగా జొరబడి కిరాతకంగా కాల్పులకు పాల్పడి పోలీసులకు పట్టుబడిన కసబ్ ఉరిశిక్ష వేయాలన్నదే ప్రజల అభిప్రాయం. అయితే ఈ కేసును 18 నెలల పాటు ప్రత్యేక న్యాయస్థానంలో గట్టి భద్రతా ఏర్పాట్ల మధ్య విచారించిన జడ్జి తీర్పు విలువరించడంలో ఆలస్యం చేయడంలో ఉత్కంఠ ఏర్పడింది. ఈ క్రమంలో కసబ్‌కు ఉరిశిక్ష వేయాలని కొంతమంది వెల్లడించిన అభిప్రాయాలను దిగువనిస్తున్నాం.



ముంబాయి మారణ హోమం సందర్భంగా తగులబడుతున్న స్టార్ హోటళ్లు. ఇన్‌సెట్‌లో 72 మందిని చంపిన కసబ్.

### ఉరి సరైన శిక్ష



కసబ్ దేశంపై దాడిచేసి ఎంతో మందిని బలి తీసుకున్నాడు. ఇటువంటి వ్యక్తిని ఇతర దేశాల్లో అయితే మరణశిక్ష విధించే అవకాశం వుంది. మన ప్రభుత్వం చాలా ఆలస్యం చేసింది. ఇటువంటి తీవ్రవాదికి ఉరిశిక్ష విధిస్తే మిగిలినవారికి కనువిప్పుగా వుంటుంది. ఇప్పటికైన ప్రభుత్వం ఆలస్యం చేయకుండా కసబ్‌కు మరణశిక్ష అమలు చేయాలి.

**- డాక్టర్ నరేంద్రరెడ్డి**, నెల్లూరు.

### కాల్చివేయాలి!



ముంబై నగరంలోని దాడులకు పాల్పడిన పాకిస్తాన్‌కు చెందిన అజ్మల్ కసబ్‌ను సంఘటనా స్థలంలోనే కాల్చివేసుంటే బాగుండేది. ఇన్ని నెలలు విచారణ చేసి శిక్ష ఖరారు చేయకపోవడంపై దేశ ప్రజలలో ఉత్కంఠ ఏర్పడింది. ఇటువంటి కేసులకు సంబంధించి విచారణ పేరుతో చాలా కాలయాపన చేయడం బాధాకరం.

**- చంద్ర**, నెల్లూరు.

### బహిరంగంగా ఉరితీయాలి



ముంబై దాడులకు పాల్పడి అమాయకులను ఊచకోత కోసిన కసబ్‌ను బహిరంగంగా ఉరితీయాలి. ఇలా చేస్తే మరొక్కరు ఇటువంటి హింసాత్మక సంఘటనలకు పాల్పడే అవకాశం వుండదు. దోషిగా నిర్ధారించిన కోర్టు శిక్ష ఖరారు చేయడంలో ఆలస్యం చేసింది. భవిష్యత్‌లో ఇటువంటి దాడులు జరగకుండా కఠిన చర్యలు తీసుకోవాలి.

**- జి.రమేష్**, నెల్లూరు.

# సేవకు మరో రూపం రెడ్‌క్రాస్!

## మే 8వ తేది అంతర్జాతీయ రెడ్‌క్రాస్ దినోత్సవం

సేవకు పెట్టింది పేరు రెడ్‌క్రాస్. ప్రపంచ వ్యాప్తంగా శాఖోపశాఖలుగా విస్తరించిన రెడ్‌క్రాస్ సేవాతత్పరతకు హద్దులు, ఎల్లలు లేవు. ఇంచుమించు ప్రతి దేశంలోనూ రెడ్‌క్రాస్ సేవా కార్యక్రమాలు నిర్వహిస్తోంది. 1964లో స్విడ్జర్లాండ్ దేశానికి చెందిన హెన్రీడ్యూనన్ట్ ఆలోచనల నుంచి రూపుదిద్దుకొన్నదే ఈ సంస్థ. ఇటలీ, ఆస్ట్రియా దేశాల మధ్య జరిగిన యుద్ధంలో ఎందరో క్షతగాత్రులవడం, ప్రథమ చికిత్స అందక మరెందరో ప్రాణాలు కోల్పోవడాన్ని చూసిన హెన్రీ తట్టుకోలేకపోయారు. ఆపద సమయంలో సహాయం చేసేవారు లేకపోవడం వలన పలువురు ప్రాణాలు కోల్పోయారని భావించిన ఆయన రెడ్‌క్రాస్ స్థాపనకు శ్రీకారం చుట్టారు.





నెల్లూరులోని రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంక్(ఫైల్‌ఫోటో).

స్విడ్జర్లాండ్ దేశానికి చెందిన జాతీయ పతాకం ఎర్రని బ్యాక్‌గ్రౌండ్‌పై తెల్లని క్రాస్ కల్గివుంటుంది. దీనిని అటుఇటు మార్చి తెల్లని బ్యాక్‌డ్రాప్‌లో ఎర్రరంగు క్రాస్‌ను రెడ్‌క్రాస్ లోగోగా ఏర్పరిచారు. మనవతావాదాన్ని కల్గి, మానవుల జీవితాలను, ఆరోగ్యాన్ని కాపాడడానికి అనునిత్యం ఇది శ్రమిస్తుంటుంది. జాతి, కుల, మత, వర్గ, వర్ణ, వయోబేధాలు లేకుండా సత్సంకల్పంతో పనిచేయడం రెడ్‌క్రాస్ సేవానిరతికి నిదర్శనం. సంస్థ ఏర్పడ్డ తొలిరోజుల్లో గాయపడ్డ సైనికులకు సేవచేయడానికి మాత్రమే పరిమితం అవుతుండేది. తర్వాత కాలంలో ప్రజలకు సేవ చేయడంపై దృష్టి సారించింది. ప్రథమ చికిత్స, ప్రమాదాల నివారణ, రక్షిత మంచినీటినందించడం, నర్సులకు శిక్షణ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల నిర్వహణతో పాటు రక్తనిధి నిర్వహణ రెడ్‌క్రాస్ చేపడుతున్న కార్యకలాపాలలో ముఖ్యమైనవి.

జెనీవాలో జరిగిన అత్యవసర సమావేశంలో ఐదు ముఖ్య సూత్రాలను తనకుతాను ఏర్పరచుకొంది. మానవత, నిస్పాక్షికత, సమతౌల్యత, స్వతంత్రం, స్వచ్ఛందసేవ, ఐక్యత, విశ్వజనీయత ముఖ్యసూత్రాలు. యుద్ధంలో గాయపడ్డ వారికి, తతిమావారందరూ సహాయం చేయాలని అది మానవ ధర్మం అని హెన్రీడ్యూనన్ట్ ఇచ్చిన పిలుపుకు విశేష స్పందన లభించింది. ఆయన చేసిన సేవలకు నోబుల్ బహుమతి లభించింది. హెన్రీ జన్మదినమైన మే 8 తేదీన ఆయన గౌరవార్థం ప్రపంచ రెడ్‌క్రాస్ దినోత్సవాన్ని జరుపుకోవడం ఆనవాయితి.

### ఉద్యమం కవిత

### ఎవరు తల్లీ!

ఎందుకు తల్లీ ఏడుస్తున్నావ్?
అలా కన్నీరు కారుస్తున్నావ్??
సువర్ణ సమైక్యాంధ్ర తల్లివా?
రత్న తెలంగాణ తల్లివా??
చెప్పమ్మా! కన్ను విప్పమ్మా!!
అందరమూ నీ బిడ్డలమే
తెలుగు వారికి తెగులు సోకింది
రక్తంలో విద్వేషం పాకింది
విద్యార్థులు ప్రాణాలు వదిలేది
ఫలితం రాజకీయ వాదులది
ఇది మోసపూరిత రాజకీయం
ప్రజలకు తెలియని మాయాజాదం -
కకావికలయ్యే చెడు స్వప్నం
దాపురించింది - దారి కాచింది
అందరం సహోదరులమే
అందరిలోనూ ఆందోళనే
గందరగోళం పరివర్తనే
మాట్లాడు తల్లీ! ఈ నీ జాతి
ఎటువైపు మొగ్గేస్తుందో నీతి
తేవద్దు తేవద్దు అపఖ్యాతి
చల్లార్చు - నీ చల్లని ఒడిన
ఓదార్చు - ఓ దరికి చేర్చు -

**-జయంపు కృష్ణ**, హైదరాబాదు.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11

# మొక్కుబడిగా సిఎం నెల్లూరు పర్యటన!

## ● మూడు మృష్టాన్న భోజనాలు, ఆరు తేనేటి విందులకే పరిమితం.

ముఖ్యమంత్రి రోశయ్య నెల్లూరుజిల్లా పర్యటన మూడు మృష్టాన్న భోజనాలు, ఆరు తేనేటి విందులుగా సాగిపోయింది. పిలిచేవారెవరు అన్నది చూడకుండా, పిలవనివాడి పాపం అన్నట్లు అందరి ఇళ్లకూ వెళ్లి, ఒక కప్పు కాఫీనో, ఒక ముద్ద అన్నమో, ఒక తియ్యటి జిలేబీయో తిని ఆనందపరచి వెళ్లారాయన. ఆయన రాక, పోకల మధ్య ఇంతకంటే వేరొక వార్త లేదా విశేషం కన్పించడం లేదు.

సరిగ్గా 26గంటల కాలం గడిపాడు ముఖ్యమంత్రి నెల్లూరులో. 1తేది ఉదయం సింహపురి ఎక్స్‌ప్రెస్ రైలులో నెల్లూరులో దిగాడు. 2తేది ఉదయం 9.20 గంటలకు హెలికాప్టర్‌లో విశాఖపట్నం బయలుదేరిపోయాడు. ఈ మధ్యలో ఆయన పాల్గొన్న అధికారిక కార్యక్రమం – విఆర్ కాలేజి మైదానంలో జరిగిన భూపంపిణీ సభ ఒకటే. తతిమా సమయమంతా విందులు, తేనేటి విందులతో గడిపేశారు. మొదట మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఇంట ఉపాహార విందు. మధ్యాహ్నం జిల్లామంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఇంట మధ్యాహ్న భోజనం. సాయంత్రం మాగుంట శ్రీనివాసులురెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డి, సరయు హోండా వ్యాపారి రాజ్‌కుమార్, సంతపేట వ్యాపారి చలమయ్య, పత్తి రవీంద్రబాబు తదితర ఇళ్లలో తేనేటి విందులు. ఆ తర్వాత ఆర్యవైశ్యుల సన్మానం, రాత్రి భోజనం. ఎంత వివరంగా చెప్పాలనుకొన్నా ఆయన పర్యటన సమాచారం ఇంతే.

నిజం చెప్పాలంటే అటు జిల్లా కాంగ్రెస్‌వాదులకు కానీ, ఇటు అధికారులకు కానీ ముఖ్యమంత్రి పర్యటన పట్ల ఆసక్తి లేదు. ఉత్సాహం అసలేలేదు. వస్తానన్నాడు కాబట్టి, ఏదో తూతూమంత్రంగా ఏర్పాట్లుచేసి సరిపెట్టారు. వారిలో ఏ కొంచెం ఆసక్తి వున్నా, ఒక రోజంతా ముఖ్యమంత్రి నెల్లూరులో వున్నదానికి ఎంతో కొంత ప్రయోజనకర కార్యక్రమాలు పెట్టి వుండవచ్చు. ముఖ్యమంత్రులు సహజంగా జరిపే సమీక్షా సమావేశం జరిపించి వుండవచ్చు. జిల్లా కాంగ్రెస్‌వాదులతో రాజకీయ పరిస్థితుల మీద చర్చ జరిపి వుండవచ్చు. కానీ రోశయ్య వీటి జోలికే వెళ్లలేదు. ముఖ్యమంత్రిగా తాను హైదరాబాదుకు పరిమితమై పోతున్నానని, దానితో ప్రభుత్వానికి ప్రజలతో సంబంధం తెగిపోతున్నదని వస్తున్న విమర్శలు తప్పించుకోవడానికి జిల్లా పర్యటనలు చేయాలి కాబట్టి, మొక్కుబడిగా వచ్చారాయన. ఆయన మనసుకు తగినట్లే జిల్లా అధికారులు, రాజకీయవాదులు కూడా అంతే తూతూమంత్రంగా ఆయన్ను స్వాగతించి సాగనంపారు.

### రైల్వే స్టేషన్‌లో బలప్రదర్శన

అయితే రోశయ్య రాకను, జిల్లా రాజకీయాలలో బలప్రదర్శనలకు వేదికగా మార్చుకోవడానికి అందరు కాంగ్రెస్‌వాదులు తమ శక్తి యుక్తులన్నీ వినియోగించారు. రైల్వే స్టేషన్‌లో ఆయన దిగినప్పటి నుంచే అది మొదలైంది. రాజీవ్‌భవన్ నిర్వాహకులు వందలాది మంది కాంగ్రెస్ కార్యకర్తలను సమీకరించి స్వాగత ఏర్పాట్లు చేశారు. ఇది ఆనం సోదరులకు ఎంత మాత్రం ఇష్టంలేని పని. వారిని స్టేషన్‌కు రానివ్వకుండా చేయడానికి పోలీసు మీద ఒత్తిడి తెచ్చారు. వారు వస్తే స్టేషన్‌లో గొడవలు జరుగుతాయని భయపెట్టారు. కానీ కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మొండిపట్టు వీడలేదు. తాము స్టేషన్‌కు రాకుండా ఆపితే ఆనం సోదరులను కూడా బయటే నిలేయాలని పట్టుబట్టారు. వివాదం ముదిరిపోతుండడంతో పోలీసు పక్కకు తప్పుకొన్నది. పది మంది అనుచరులతో షోగ్గా వచ్చిన వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి రాజీవ్‌భవన్ గుంపును చూసి వెనకడుగు వేయక తప్పలేదు. వారికి ఏ మాత్రం చెయ్యి అడ్డుపెట్టినా బీభత్సం తప్పదని భయపడి, ముఖ్యమంత్రి కంటే ముందు స్టేషన్ నుంచి బయటకు వచ్చేశారు వారు. రోశయ్య గారు కూడా రైలు దిగగానే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, కాకాణి భుజాల మీద చేతులు వేసి, క్రింది వరకు వారిని పక్కన పెట్టుకోవడంతో, జిల్లా రాజకీయాలలో ఆయన మొగ్గ ఎటో చెప్పకనే చెప్పినట్లయ్యింది.

### వేదిక మీద రగడ

నెల్లూరు సిటీ నియోజకవర్గం నుంచి పోటీ చేసి ఓడిపోయిన కాంగ్రెస్ అభ్యర్థి డాక్టర్ అనిల్ కుమార్ యాదవ్ విఆర్ కాలేజీ మైదానంలో జరిగిన భూపంపిణీ సభా వేదిక ఎక్కకుండా చేయాలని శతవిధాలా ప్రయత్నం చేశాడు మంత్రి రామనారాయణరెడ్డి. ముందుగానే కలెక్టర్‌ను పిలిచి, వేదిక ఎక్కేవారి పేర్ల జాబితా వ్రాసి, అందులో అనిల్ పేరు లేకుండా చేశాడు. జాబితాలో పేర్లులేనివారు ఎవరినీ అనుమతించవద్దని ఎస్పీకి హుకుం జారీ చేశారు. అయితే సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, జిప ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి దీన్ని ప్రతిఘటించారు. ఓడిపోయిన అభ్యర్థులలో ఏ ఒక్కరినీ వేదిక మీదకు అనుమతించినా, అనిల్‌ను కూడా రానివ్వాలని, ఇందులో వివక్షత చూపిస్తే సభ జరగనివ్వమని తీవ్ర స్వరంతో హెచ్చరించారు. దానితో కలెక్టర్‌కు వేరే గత్యంతరం లేకపోయింది. విచిత్రం ఏమిటంటే, ఎదుటి వర్గం వేదిక ఎక్కకుండా చేసి వినోదించాలనుకొన్న ఆనం సోదరులకు తమ అనుచరులకు ప్రవేశం లేని అవమానం ఎదురు కావడం. ఇరు వర్గాల మధ్య వేదిక విషయంలో పట్టుదలలు చూసిన ఎస్పీ దామోదర్ జాబితాలో పేర్లులేని వారిని కఠినంగా, మెడపట్టి బయటకు తోసేశారు. చేవూరు దేవకుమార్‌రెడ్డి, హరిబాబు యాదవ్ వంటి వారికి ఈ చేదు అనుభవం ఎదురైతే, ఆనం కార్పొరేటర్లు ఇద్దరు పాపం పది మంది ముందు పోలీసు దెబ్బ రుచి చూడవలసి వచ్చింది. తమ ప్రధాన అనుచరులను పోలీసు చాచి లెంపకాయ కొడుతున్నా చూస్తూ వూరు కోవడం తప్ప ఏమీ చేయలేకపోయాడు మంత్రి.

గత ఇరవయ్యేళ్లుగా నెల్లూరులో ఏ సభ జరిగినా, ఏ విఐపి వచ్చినా అంతా తామై ప్రవర్తించడం ఆనం వారికి అలవాటు. నేదురుమల్లి జనార్ధనరెడ్డి వారికా అవకాశం ఇచ్చాడు. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రి అయిన తర్వాత నెల్లూరు నగర



నెల్లూరు విఆర్ కళాశాల మైదానంలో జరిగిన భూపంపిణీ సభలో పాల్గొన్న ముఖ్యమంత్రి రోశయ్యతోపాటు అతిరథ మహారథులు.

రాజకీయం తమకు రిజిష్టర్ ఆఫీసులో రిజిష్టర్ చేసిన ఆస్తి పత్రం వంటిదన్న ధీమాతో వుండినారు వారు. రాజీవ్‌భవన్ పుణ్యాన మొదటిసారిగా ఆ పెత్తనం హరించుకపోయింది. నలుగురిలో ఒకరిగా తప్ప ఆనం వారికి ఏ ప్రత్యేకత లేదన్న సందేశాన్ని కాంగ్రెస్ కార్యకర్తలకు అందించడంలో రాజీవ్‌భవన్ సఫలీకృతమైంది. ఈ అవమానాన్ని తట్టుకోవడం ఆనం వారికి కష్టమే పాపం. కానీ ఏమీ చేయలేని పరిస్థితి. వైఎస్ ఇచ్చిన అధికారాన్ని తమ ఆస్తులు పెంచుకోవడానికి, అక్రమార్జన చేయడానికి, అహంకార ప్రదర్శనకు తప్ప పది మంది అభిమానం సంపాదించడానికి ప్రయత్నం చేయలేదు వారు. ఆ పాపం ఈ రూపంలో కట్టి కుదుపుతున్నదిప్పుడు.

### విందులలోనూ పోటీయే!

ముఖ్యమంత్రికి విందులివ్వడానికి కూడా కాంగ్రెస్ వర్గాలు పోటీ పడ్డాయి. మొదట అనుకొన్న ప్రకారం జనార్ధనరెడ్డి ఇంట్లో ఉపాహారం, రామనారాయణరెడ్డి ఇంట్లో మధ్యాహ్న భోజనం మాత్రమే ఉన్నాయి. కానీ ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి ముఖ్యమంత్రి తన ఇంటికి కూడా రావాలని పట్టుబట్టాడు. ఆ ఒత్తిడికి తలవొగ్గిన ముఖ్యమంత్రి, సమతూకం పాటించడం కోసం కేంద్రమంత్రిణి పనబాక లక్ష్మి ఇంట్లో విందును కూడా కార్యక్రమంలో చేర్చారు. జనార్ధనరెడ్డి తన మన తేడా లేకుండా అందరినీ ఆహ్వానించాడు. కానీ వివేకానందరెడ్డి, ఆయన అనుచరులు కావాలని గైర్హాజరైనారు. దానితో రామనారాయణరెడ్డి విందుకు జనార్ధనరెడ్డి అనుచరవర్గంతోపాటు ఎమ్మెల్యేలు ప్రభాకర్‌రెడ్డి, మేకపాటి శేఖర్‌రెడ్డి, నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, జిప ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఎగ్గొట్టారు. దానితో ఎవరి పక్కన ఎవరున్నారో స్పష్టంగా అర్థమైపోయింది. రామనారాయణరెడ్డి మాత్రం ఈ పోటీల జోలికి వెళ్లకుండా ప్రభాకర్‌రెడ్డితో సహా అందరి ఇళ్లకూ వచ్చాడు. ఏ వర్గంతోనూ సంబంధం లేని మాగుంట శ్రీనివాసులురెడ్డి ఇంటికి మాత్రం అందరూ హాజరైనారు.

### ఆత్మీయంగా జరిగిన ఆర్యవైశ్య సన్మానం

తతిమా అన్ని కార్యక్రమాలకు రాజకీయ బలవంతంతో అన్యమనస్కంగా హాజరైన ముఖ్యమంత్రి రోశయ్య ఆర్యవైశ్యులు జరిపిన సన్మాన సభలో మాత్రం మనస్ఫూర్తిగా పాల్గొన్నారు. చాలా ఆత్మీయంగా జరిగిందా సభ. ఏ రాజకీయ నాయకుడినీ పిలవలేదు వారు. తమ కుటుంబ పెద్దను సత్కరించిన సంతోషంతో జరుపుకొన్నారు. ముఖ్యమంత్రి కూడా అంతే అభిమానం ప్రదర్శించారు. అయితే తాను పెద్ద పదవిలోకి వచ్చానని మీరు విర్రవీగే ప్రయత్నం చేయవద్దు, ఆ పని ఈ పని కావాలని అడగవద్దు. మనలో ఒకడు ఉన్నత స్థానానికి వచ్చాడన్న ఆనందంతో తృప్తిపడండి చాలు అని సున్నితంగా హితబోధ చేశాడు ముఖ్యమంత్రి. పదవులు, పనుల కోసం తన వద్దకు రావద్దని చెప్పకనే చెప్పాడు.

మొత్తం మీద ముఖ్యమంత్రి 26 గంటల పర్యటన రాజకీయ బల ప్రదర్శనలతో, విందుల పోటీతో సుఖాంతమైంది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.